## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2990100061743

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!



ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

భారతీయ సాహిత్య నిర్మాతలు

# రాహుల్ సాంకృత్యాయన్

ఇంగ్లీ మూలం:

ప్రభాకర్ మాచ్వే

అనువాదం :

ఎస్. ఎస్. ప్రభాకర్



సాహిత్య అకాడెమి

# విషయసూచిక

—:o:—

# ఉపోద్ఘాతం

మహాపండిత రాహుల్ సాంకృత్యాయన్ జీవిత, సాహిత్యాలపై పరిశీలనా గ్రంథాన్ని రచించటం ఏ రచయితకైనా కష్టతరమైన విషయమేకాక, ఒక సవాలు కూడ. ఇందుకు కారణాలు రెండు. మొదటిది: ఈయన్ని గురించిన సమగ్రమైన రచన ఏదీ హిందీ భాషలోనైనా లేకపోవటం. రెండవది: ఆయన రచనల పరిధి విస్తృతం, బహుముఖం కావటంవలన, ఆయన సాహిత్యానికిచేసిన సేవ సమగ్ర స్వరూపాన్ని వివరంగా చర్చించటం సాధ్యంకాదు. ఉదాహరణకి, 'మేరీ జీవన్ యాత్ర' (నా జీవితయాత్ర) అనే ఆయన ఆత్మకథని తీసుకుందాం. 1944 లోను, 1950 లోను ప్రచురించబడిన రెండు సంపుటాల ఈ గ్రంథం పునర్ముద్రితం కాలేదు. మొదటి సంపుటంలో 564 పుటలు, రెండవ సంపుటంలో 783 పుటలు ఉన్న ఈ గ్రంథం నిర్విరామం అయిన ఆయన జీవితంలోని కొన్ని ముఖ్యాసంఘుట నల్ని 1947 వరకు మాత్రం తెలియజేస్తుంది. ఆయన మరణానంతరం వెలువడ్డ మూడు సంపుటాలుకూడ ఆయన జీవితంలోని అంతిమ ఘట్టాల్ని స్పృశించవు. ఆయన వ్రాసుకున్న అసంఖ్యాకాలైన డెయిరీలు ఇంకా ప్రచురణ భాగ్యానికి నోచుకోలేదు. ఆయన గురించి ఆయన మూడువేల పుటలకు మించి వ్రాసిన విష యాల్ని, ఒక ప్రకరణ పరిధిలో కుదించవలసివస్తే, ఆ విషయాల్ని రేఖామాత్రం గానే సూచించటం తప్పనిసరి అవుతుంది. ఇది ఆయన రచనలకికూడ వర్తిస్తుంది. ఈ పుస్తకంలోని అనుబంధంలో ఆయన రచించిన 125 గ్రంథాలు పేర్కొన బడ్డాయి. ఈ గ్రంథాలని ఆయన హిందీ, సంస్కృతం, పాళి, టిబెటన్, భోజ్‌పురి అనే అయిదు భాషలలో రచించారు. ఆయన ఆ గ్రంథాలలో పరిశీలించిన విష యాల విస్తృతి బహువిశాలమైనది. తత్త్వశాస్త్రం, చరిత్ర, సామాజిక శాస్త్రం, విజ్ఞానశాస్త్రం, పర్యటన వ్యాసావళి, జీవిత గాథలు, నవలలు, నాటకాలు, వ్యాసాలు, నిఘంటు రచనలు, వ్యాకరణ గ్రంథాలు. గ్రంథాలలోని పాఠభేద వివేచన, పరి శోధనలు, టిబెట్టు దేశాధ్యయనాలు, బౌద్ధమతం, జానపద విజ్ఞానం, రాజకీయ పరి శీలనలు, చివరికి కరపత్ర రచన మొదలైన అన్ని విషయాల్ని గురించి ఆయన రచనలుచేశారు. ఆయన రచనల్లో అనేక స్థాయిల చెందిన వైవిధ్యం గోచరిస్తుంది. అనువాదాలు, సంస్కృతం, టిబెటన్ భాషలు అధ్యయనం చేయటానికి ఉపకరించే

ప్రాథమిక పాఠ్యగ్రంథాలనించి, బౌద్ధతర్కశాస్త్రంపై ధర్మకృతిచేసిన పరిశీలనాత్మక గ్రంథంపై నిశితమైన, అమూల్యమైన వ్యాఖ్యానం వరకు ఆయన అనేక విధాలైన రచనలు చేశారు. ఆయన రచనలలోని సాహిత్యపు విలువలు ఒకే స్థాయికి చెంది ఉండవు. అసాధారణ పాండితీ ప్రాభవాలు కలిగి, అతిసాహసి అయిన యాత్రా శీలి, సాంఘిక సంస్కర్త అయిన ఈయన రచనల మొదటి ప్రభావం అతిప్రగాఢ మైనది. విద్యాలయాలలో క్రమపద్ధతిలో అధ్యయనం చేయకుండా, పనిచేయటానికి ఒక నిలకడ స్థానం లేకుండా, తరచు తనపేరుని, నమ్మకాల్ని మార్చుకుంటూ, 'విజ్ఞానం కొంతకాలానికి ఉపయోగించి పడవ మాత్రమే, తలపై మోయలేని బరువు కాదు' అనే బుద్ధుని మాటల్ని తమ ఆత్మకథలో పదేపదే తమ జీవితమార్గాన్ని నిర్దేశించే సూత్రంగ పేర్కొనటం జరిగింది. బహుభాషావేత్త. ప్రపంచ యాత్రీ కుడు అయిన ఈ వ్యక్తి దుర్గమప్రాంతాల్లో ప్రయాణం చేయటంలోను, స్వాతంత్ర్యం సంగ్రామ సందర్భంలోనూ, ఎన్నో కష్టనిష్ఠురాలికి గురికావలసివచ్చినా ఆయన చేసిన విస్తృత రచనా వ్యాసంగం అందర్ని ముగ్ధుల్నిచేస్తుంది. స్వయం కృషితో పైకివచ్చిన ఈయన్ని గురించి ఎక్కువ విషయాలు తెలుసుకొన్నకొద్దీ, ఈయన మేధాసంపత్తిపైనా, కష్టాలని ఎదుర్కోవటంలో ఆయన చూపించిన సామర్థ్యం పైనా, హేతువాదానికి అంకితమైన స్వేచ్ఛాప్రవృత్తి పైనా గౌరవం ఇనుమడి స్తుంది. ధైర్యశాలి, సాహసవంతుడు అయిన ఇటువంటి వ్యక్తి జ్ఞాపకశక్తి క్షీణించే రోగం (amnesia) తో మరణించటం చాలా విచారకరం. 1963 లో ఆయన మర ణించిన తరువాత, ఏవో కొన్ని ఆవేదనా పూరితాలైన స్మారక వ్యాసాలు మినహా యిస్తే, ఆయనపై ఎక్కువ రచనలు వెలువడలేదు. బరోడాలోని మహారాజ శాయాజి రావు విశ్వవిద్యాలయం వారి త్రైమాసిక పత్రికలో డా. విష్ణువర్ధన్ అగర్వాల ఆంగ్లంలో వ్రాసిన అభినందన వ్యాసం ఒక్కటే ప్రత్యేకంగా పేర్కొన తగింది.

ఆయన సాధించిన విజయాలలాగే, ఆయన వ్యక్తిత్వంకూడ విశిష్టమైనది, మరువరానిది. టిబెట్‌లోని విలువైన వ్రాతప్రతుల్ని, చిత్రపటాల్ని, దుర్లభమైన పుస్తకాల్ని ఆయన తీసుకువచ్చిన సందర్భంలో ప్రఖ్యాత చరిత్రకారుడు డా. కాశీ ప్రసాద్ జైస్వాల్ 'మోడర్న్‌రెవ్యూ' అనే పత్రికలో ఒక వ్యాసం వ్రాశారు. కాంతి వంతమైన ఆయన ముఖవర్చస్సుని ఆ వ్యాసకర్త బుద్ధుని ముఖవర్చస్సుతో పోల్చారు. 'ఆరడుగుల పొడుగు, విశాలమైన ఫాలము, ఛాతీ, గుండ్రని భుజా లతో ఆయన ప్రాచీన ఆర్యులని జ్ఞప్తికి తెస్తారు. ఆయన బాహ్యారూపం బుద్ధుడి రూపంతో పోలివుందని ప్రఖ్యాత ప్రాచ్యవిజ్ఞాన నిష్ణాతుడు సెల్విన్ లెవి తెలియ

చేసాడు' అని అమృత్‌రాయ్ వర్ణించారు. దయాపూరితమైన, ఉన్నతమైన ఆయన భౌతిక రూపాన్ని హిందీ రచయితలు 'మహాస్తంభము' (భగవత్ శరణ్ ఉపాధ్యాయ), 'వటవృక్షము' (ఠాకుర్ ప్రసాద్ సింగ్), 'హిమాలయ పర్వతశ్రేణుల్ని అధిగమించి వానితో తాదాత్మ్యాన్ని పొందిన హిమాలయ పర్వతాల ఆరాధకుడు' (విద్యానివాస్ మిశ్ర) అని అభివర్ణించారు. ఆయన శేముషి, భావనాశక్తి అనన్య సామాన్యమైనవి. ఆయన ఉదార స్వభావం కలిగిన మనవతావాది, రాజీపడని స్వేచ్ఛాప్రియుడు.

ఉత్తరప్రదేశ్‌లోని ఆజమ్‌ఘర్ జిల్లాలో ఒక చిన్న గ్రామంలో 'సరయు పారీణ' అనే సనాతన బ్రాహ్మణ కుటుంబంలో ఆయన జన్మించారు. చాలా చిన్న వయస్సులోనే జ్ఞానాన్ని అన్వేషిస్తూ ఆయన ఇంట్లోంచి వెళ్లిపోయారు. ఆయన అసలు పేరు కేదారనాథ్‌పాండె. కాశీలో సంస్కృతం, అరెబ్బీ, పారశీక భాషల్ని ఆయన సంప్రదాయ పద్ధతిలో నేర్చుకున్నారు. తమకివచ్చిన మిగతా ముప్ఫై భాషల్ని ఆయన స్వయంకృషితోనే నేర్చుకున్నారు. తమ అసలుపేరుని, తమ సనాతన హిందూ మత విశ్వాసాల్ని మార్చుకున్నారు. 'బాబారామ్ ఉదార్‌దాస్' అని తమ పేరుని మార్చుకుని, సంచార భిక్షువుగా, ఆర్యసమాజ సభ్యుడిగ మారారు. కాని ఆర్యసమాజంలోని వైదిక సిద్ధాంతాల్ని అంగీకరించలేకపోయారు. నేపాలు, శ్రీలంక దేశాల పర్యటన తరువాత ఆయన బౌద్ధ భిక్షువుగామారి, పీతవస్త్రాలు ధరించటం మొదలుపెట్టారు. పాళి, సింహళ, టిబెటన్ భాషలలోని బౌద్ధమత గ్రంథాల్ని అధ్యయనంచేసి 'మహాపండిత' అనే బిరుదుని సంపాదించారు. తీర వాద మతానికి చెందిన త్రిపిటిక బౌద్ధమత సూత్రాలు అన్నింటిలోను నిష్ణాతులకి ప్రదానం చేయబడే 'త్రిపిటకాచార్య' బిరుదాన్నికూడ పొందగలిగారు. ఇందుకోసం, తన ప్రాణాలని లెక్కచేయకుండా టిబెటన్ భాషని నేర్చుకోడం కోసం లామాల సీమలో కష్టభూయిష్టమైన ప్రయాణాలుచేసి, మూగసాధువుగా కూడ జీవితాన్ని గడిపారు. బౌద్ధమత ప్రచారకునిగా ఆయన ఐరోపాఖండంలో కూడ పర్యటించి, ఆయన ప్రాచ్య విజ్ఞాననిధులని అనేకమందిని కలుసుకున్నారు. కాని ఐరోపా ఖండం ఆయన్ని ఎక్కువగా ఆకర్షించలేకపోయింది. అమెరికాలో బౌద్ధమత ప్రచారానికై వచ్చిన ఆహ్వానాన్ని కూడ ఆయన అంగీకరించలేదు.

ఈ ఘట్టంలో మార్క్సిజమ్ ఆయన్ని ఎక్కువగా ఆకర్షించసాగింది. **1935** లో ఆయన సోవియట్ రష్యాలో మొదటిసారి పర్యటించిన తరువాత, సోషలిస్టు అభిమానిగా మారారు. కిసాన్ సభకి, భారత జాతీయ కాంగ్రెసుకి

సంబంధించిన ప్రత్యక్ష రాజకీయాలలో పాల్గొనడం ప్రారంభించారు. ఆయన మళ్లీ 1937 లోను, 1944 లోను, 1962 లోనూ మూడుసార్లు రష్యా సందర్శించారు. దురదృష్టవశాత్తు, ఆయన ఆఖరిప్రయాణం తన జ్ఞాపకశక్తి కోల్పోయిన తరవాత చికిత్సకోసం జరిగింది. కాని ఆయన తన అస్వస్థత నయం కాకుండానే స్వదేశానికి తిరిగి వచ్చేశారు. 1939 అక్టోబరు 19 వ తేదీన మోన్‌ఘీర్‌లో ఆయన కమ్యూనిస్టు పార్టీ సభ్యుడిగ చేరారు. తొమ్మిది సంవత్సరాలపాటు కమ్యూనిస్టుగా పనిచేశారు. బొంబాయిలో హిందీ సాహిత్య సమ్మేళనంలో ఆయన చేసిన అధ్యక్షోపన్యాసాన్ని నిరసిస్తూ భారత కమ్యూనిస్టు పార్టీ 1944 జనవరి నెలలో ఆయన సభ్యత్వాన్ని రద్దుచేసింది. జ్ఞానాన్వేషణకోసం ఒక స్థావరం నించి ఇంకొక స్థావరానికి, ఒక విశ్వాసాల సమాహారం నించి ఇంకొక సమాహారానికి నిరంతరం ప్రయాణం చేసే నిర్విరామ మహితాత్ముడు ఆయన. దుఃఖాన్నించి మానవాళికి స్వేచ్ఛని సముపార్జించటానికి పాటుపడే మహాత్ముడు.

పదేళ్లయినా రాకముందే, 1909 లో ఆయన రహస్యంగా ఇల్లు విడిచిపెట్టి, వారణాసికి వెళ్లారు. 1907, 1909 సంవత్సరాలలో తనకాళ్లపై తాను నిలబడ్డానికి ఏదైనా ఉద్యోగం సంపాదించుకోవటం కోసం కలకత్తా వెళ్లారు. తన నిజమైన పర్యటన జీవితాన్ని ఆయన 1910 లో ప్రారంభించారు. అప్పట్లో ఆయన గమ్యస్థానం ఉన్నత హిమాలయ పర్వతశ్రేణి. ముందు కొందరు భిక్షువులతో కలిసి ప్రయాణంచేశారు. తరువాత, ఒంటరిగానే ప్రయాణంచేశారు. భారతదేశం నలుమూలలా ఆయన పర్యటనచేశారు. అనేక పట్టణాల్ని, నగరాల్ని ఆయన పదకొండు సంవత్సరాలపాటు సందర్శించారు. కాశీ, పరాశ, తిరుమిషి, తిరుపతి, కాంచీపురం, బెంగుళూరు, విజయనగరం, త్రియంబకం, ఉజ్జయిని, అహమ్మదాబాదు, అయోధ్య, ఆగ్రా, లాహోరు, కూర్గు మొదలైన ఎన్నో ప్రదేశాల్ని ఆయన సందర్శించారు. 1926 లో మళ్లా హిమాలయాలకి తిరిగివెళ్లి, టిబెట్, బుషాహర్ రాష్ట్రం, సుమ్నామ్, కానమ్, స్పేటి వంటి దూరప్రాంతాల్ని దర్శించారు.

1923 లో రాహుల్ విదేశపర్యటన ప్రారంభం అయింది. మొదట ఆయన నేపాలు వెళ్లారు. 1927 లో శ్రీలంక వెళ్లారు. 1930 లో ఆయన తన పేరుని 'రామ్ ఉదార్ దాస్' నించి 'రాహుల్ సాంకృత్యాయన్' అనే బౌద్ధమతానికి సంబంధించిన పేరుగా మార్చుకున్నారు. ఈ పేరే ఆయన్ని చివరివరకు అంటిపెట్టుకుని ఉంది. టిబెట్ దేశానికి ఆయన నాలుగుసార్లు వెళ్లారు. ఈ ప్రయాణాలు మిక్కిలి కష్టభూయిష్టాలు, భీతికలిగించేవి అయినప్పటికీ, అవి ఆయనకి

ఎంతో సంతృప్తికరంగాను, అర్థవంతంగాను అగుపించాయి అని తన పర్యటాను భవాల్లో తెలియజేసారు. 1932 లో ఐరోపాఖండానికి వెళ్లినప్పుడు, ఫ్రాన్సు, జర్మనీ, ఇంగ్లాండు దేశాలలోని ప్రజల జీవన వ్యవహారాల్ని పరిశీలించారు. రష్యాలో లెనిన్ గ్రాడ్ విశ్వవిద్యాలయంలో బోధించడమే కాక, రష్యాలోని మధ్య ఆసియా ప్రజలని గురించి ప్రత్యేక అధ్యయనాన్ని చేసారు. తరువాత, ఆయన 'మధ్య ఆసియా చరిత్ర' అనే బృహద్గ్రంథాన్ని రెండు సంపుటాలుగా వెలువరించారు. ఈ గ్రంథాలవలన ఆయనకి 1958 లో హిందీ సాహిత్యానికి సంబంధించిన కేంద్రసాహిత్య అకాడమి బహుమతి లభించింది. మధ్య దూరప్రాచ్య ప్రాంతాలలోని ఎన్నోదేశాల్లో రాహుల్ పర్యటించారు. జపాను, కొరియా, ఇరాక్, చైనా వంటి దేశాల్ని ఆయన సందర్శించారు. 1907 నించి 1963 వరకు ఆయన జీవిత గాథ నిరంతర పర్యటనల గాథ. ఈ పర్యటనల్ని ఆయన ఒక తత్వశాస్త్రంగ రూపొందించి, 'ఘూమ్‌క్కార్ శాస్త్ర' ('సంచార శాస్త్రం') అనే గ్రంథాన్ని రచించారు. రెండు, మూడు సంవత్సరాలకి మించి నిశ్చలమైన వైవాహిక జీవితాన్ని ఆయన అనుభవించి ఎరుగరు. మొదటిసారి, లెనిన్‌గ్రాడ్‌లో లోలా (ఎలెన్ స్మెర్టోల్నా) అనే మంగోలు విద్వాంసురాల్ని వివాహం చేసుకున్నారు. వారికి ఇగోర్ అనే కొడుకు పుట్టాడు. కాని అప్పటి స్టాలిన్ ప్రభుత్వం ఆయన భార్యకాని, కొడుకు కాని ఆయనతో భారతదేశానికి వెళ్ళటానికి అనుమతింపలేదు. తరవాత, నేపాలులోని భారతీయ మహిళ డా. కమల సాంకృత్యాయన్ (వివాహానికి పూర్వం. కమల పెరియార్) ని పెళ్ళిచేసుకుని, మసూరిలో కొంతకాలం వైవాహిక జీవితాన్ని గడిపారు. జయ అనే కూతురు, జేత అనే కొడుకు పుట్టిన తరవాత. శ్రీలంక విశ్వవిద్యాలయం ఆయన్ని బౌద్ధమత ఆచార్యుడిగ ఆహ్వానించింది. అక్కడే ఆయన తీవ్రమైన అనారోగ్యానికి గురి అయ్యారు. (డయాబిటీసు, రక్తపు మధుమేహం పోటు వ్యాధి, గుండెనొప్పి. ఆయన ఆరోగ్యాన్ని బాగా దెబ్బతీశాయి, ఇంతకు ముందే చెప్పినట్లు, ఆయన ఆఖరి రెండు సంవత్సరాల్లో ఆయన జ్ఞాపక శక్తికూడ క్షీణించసాగింది. 1963 వ సంవత్సరంలో డార్జిలింగులో ఆయన కన్ను మూశారు. ఆయనని సమాధిచేసిన ప్రదేశంలో ఒక చిన్న స్మారక చిహ్నం నెలకొల్పబడింది.

ప్రాథమిక పాఠశాలలో ఉర్దూభాష నేర్చుకొనే సమయంలో నవజిందా బజిందా వ్రాసిన 'ఖుద్రాయ్‌కా నతీజా' అనే కథని చదివారు. అందులోని ఒక ద్విపద గీతిక ఆయన పసిహృదయాన్ని ఎంతగానో ఆకర్షించింది. ఆ గీతికని ఆయన చాలసార్లు తమ ఆత్మకథలో ఉదాహరించారు.

సాయిర్ కర్ దునియాకి గఫిల్ ఫిర్ కహాం
జిందగి గర్ కుఛ్ రాహితో నౌజవాని ఫిర్ కహాం।

ఓ అజ్ఞానీ, ఓ సోమరీ!
ఈ విశాల విశ్వాన్ని సందర్శించిరా!
లభించదు మరో జీవితం దీనికోసం;
కలకాలం జీవించినా తిరిగిరాదు
నవయౌవన మధుహాసం!

'ఒకేచోట కలకాలం నిలచిపోకు; నిరంతరం గమనశీలివి కమ్ము'— అనేదే ఆయన జీవిత ఆదర్శం. ఈ నిర్విరామమైన జిగమిష ఆయన వ్యక్తిత్వాన్ని సంపూర్ణంగ ఆవేశించింది. అయనలోని ఏవో అనిర్వచనీయమైన అంతశ్శక్తి ఆయనని ప్రేరేపించి స్తబ్దుడిగ, అల్పసంతోషియైన సామాన్య గృహస్థుడిగ జీవితాన్ని వెళ్ళ బుచ్చవద్దని ఆయన్ని ప్రబోధించింది. ఒక ప్రదేశంనించి మరొక ప్రదేశానికి, ఒక ఖండంనించి మరొక ఖండానికి, ఒక భాషనించి మరొక భాషకి, మానవ సంబంధమైన విజ్ఞాన అన్వేషణలో ఒక రంగంనించి మరొక రంగానికి ఆయన నిరంతరం పరిక్రమిస్తూ ఉండేవారు. ఏదో మూట కట్టుకోవాలని, ఎక్కడో కాలూని నిలవాలని అయన ఎప్పుడూ ప్రయత్నం చేయలేదు. జ్ఞానాన్వేషణ ఆయనలోని తీరనిదాహం.

1948 లో అలహాబాదులోని హిందీ సాహిత్య సమ్మేళనంలో పరిపాలనా శాస్త్రానికి సంబంధించి హిందీ-ఇంగ్లీషు భాషలకి చెందిన పారిభాషిక పదకోశాన్ని తయారుచేయటంలో నేను రాహుల్‌తో కలిసి పనిచేయటం తటస్థించింది. ఆ సందర్భంలో ఒకాయన, 'ఈ పని తొందరపాటుతోను, అసమగ్రంగాను జరిగింది' అని విమర్శించారు. ఆ వ్యక్తి ఆ గ్రంథంలోని లోపాలని సవివరంగా చర్చిస్తూంటే, ఆయన అతిశ్రద్ధతో ఆలకించి, తన స్వాభావికమైన చిరునవ్వు చిందిస్తూ ఇలా జవాబిచ్చారు." 'ఏదీ శాశ్వతం కాదు' అని బుద్ధ భగవానులు సెలవిచ్చారు, 'శబ్దమ్ క్షణికమ్', 'అంతా అనంతం' అని లెనిన్‌కూడ వక్కాణించారు! ఏ వ్యక్తీ సంపూర్ణ మానవుడు అని నేను విశ్వసించను. సత్యంపై సర్వాధికారాలు నాకు లేవు. నాకు చేతనైనది నేను చేస్తాను, భావితరాలవారు నేను చేసిన పనిని ఉన్నత శిఖరాలకి తీసుకువెడతారని నేను ఆశిస్తాను", మరపురాని ఈ మాటలు రాహుల్ తమ పరిధుల్ని పూర్తిగా తెలిసిన వారని వెల్లడిస్తాయి.

# 1. జీవితం

రాహుల్ అసలు పేరు కేదారనాథ్‌పాండె. ఆయన 1893 వ సంవత్సరం ఏప్రిల్ 9 న జన్మించారు. ఆయన తండ్రి గోవర్ధనపాండె దైవభక్తిపరుడైన ఒక సామాన్య రైతు. ఆయన తల్లి కుల్వంతి తమ తలిదండ్రులతో పందహాగ్రామంలో ఉండేవారు. అక్కడే కేదార్ జన్మించారు. తల్లి ఇరవై ఎనిమిది ఏళ్ల వయసు లోను, తండ్రి నలభై అయిదేళ్ల వయసులోను మరణించటంవల్ల, ఆయన్ని వారి అమ్మమ్మ అతిగారాబంతో పెంచింది. ఆయన గ్రంథస్థంచేసిన మొదటి జ్ఞాపకాలు 1897 లోని తీవ్రక్షామానికి సంబంధించినవి.

1898 లో ఆయన్ని 'మదరసా' అవే ప్రాథమిక పాఠశాలలో చేర్పించారు. ఉర్దూ అక్షరమాలతో ఆయన ప్రథమ పరిచయం అక్కడే జరిగింది. ఆటల్లో ఎక్కువ ప్రావీణ్యం సంపాదించలేకపోయానని ఆయన తెలియజేశారు. పాఠశాలలో ఆయనకు సహాధ్యాయులు సయ్యద్, షియా మహమ్మదీయులు. తమ ఉపాధ్యాయుల్లో ఆయనకి జ్ఞాపకం ఉన్నవారు బాబుపత్తర్ సింగు, రాణిసరాయ్ ప్రాథమిక పాఠశాలలో ఆయన పిల్లలకి నిర్దాక్షిణ్యంగ బడితపూజ చేస్తూండేవారు. తమ ఆత్మకథలోని ప్రథమ సంపుటం, రెండవ అనుబంధంలో తమ వంశానుక్రమణికని, గోత్ర ప్రవరిని వేదకాలంనించి విచిత్ర స్వభావం కలిగిన తాత రామశరణ్ పథక్ వరకు సవివరంగా తెలియజేశారు. ఆయన తమ తండ్రిని గురించికూడ హాస్య ధోరణిలో వ్రాశారు. అల్లరి చిల్లరిగా తిరిగే తనని తన తండ్రి వెంటబడి తరమటం ఆయన వర్ణించారు. రాహుల్ తల్లి, ఏకైక సోదరి ఆయన చిన్నతనంలోనే చని పోయారు. ఆయనకి చిన్నతనంలోనే పెళ్ళికూడ అయింది. కాని తమ మొదటి భార్యని ఆయన ఎప్పుడు సరిగ్గా చూడనైనా చూడలేదు తన తొమ్మిదో ఏట కాశీకి, పధ్నాలుగో ఏట కలకత్తాకి వెళ్ళారు. ఇంట్లోంచి ఆయన ఇలా వెళ్ళిపోవటానికి కారణాలు స్పష్టంగా తెలియవు. విశాల ప్రపంచాన్ని చూడాలి అని, విజ్ఞానాన్ని సముపార్జించాలి అని ఆయన ఆకాంక్షించటం ఇందుకు కారణం అని ఆయన వివరించారు అయితే, కలకత్తావంటి నగరంలో దిక్కుతోచక, ఆశలు ఫలించక, అయన తమ గ్రామానికి తిరిగివెళ్ళిపోయారు. 1909 లో తమ పందొమ్మిదో ఏట మళ్ళి ఆయన కలకత్తా వెళ్ళారు. అక్కడ ఒక పొగాకు కంపెనీలో ఓ చిన్న

ఉద్యోగం చేశారు. మత్తుమందు కలిపిన తినుబండారాలని ఏవో తిని ఆయన స్పృహ కోల్పోగా, ఆయన్ని వైద్యకళాశాల ఆసుపత్రిలో చేర్పించారు.

పర్యాటనలపై ఉత్సాహం, స్తబ్దంగా నాలుగు గోడల మధ్య ఒదిగివుండే లౌకిక జీవిత విధానాన్ని, ఒక పద్ధతిలో విజ్ఞానాన్ని ధనాన్ని ఆర్జించే విధానాన్ని విడచి పెట్టాలనే ఉత్కంఠ 1910 లో రాహుల్‌ని సంచార భిక్షువుల జీవితంవైపు ఆకర్షితుణ్ని చేశాయి. ఆయన మనసు అతిసున్నితం; ఆయన ప్రవృత్తి అంత ర్ముఖమైనది. వేదాంతాన్ని సంస్కృతంలో చదవాలని ఆయన అభిలాష. సాధు వుల్లో చేరటానికి ఈ పర్యాయం ఆయన వెళ్ళినప్పుడు, ఏదో పనిచేసి ఆర్జించాలని కాని, జీవితంలో స్థిరపడి సుఖ, సంతోషాలు అనుభవించాలని కాని ఆయన కోరుకోలేదు. జీవితాన్ని ప్రపంచాన్ని నిరసించటం, నిస్సంగత్వం అప్పటికే ఆయన మనసుని, ఆత్మని వశపరచుకున్నాయి. అందుచేత ఆయన దగ్గరవున్న వస్తువులు బహుతక్కువ. ఆయన కోరికలు ఎక్కువగా ఆధ్యాత్మికమైనవి. సాధువు లతో సాంగత్యం ఆయన్ని సనాతన ఆచారాలపైన, అంధవిశ్వాసాలపైన ఘాటైన విమర్శకుడిగ తయారుచేసింది. చివరికి ఆయన నాస్తికుడిగ. నికరమైన భౌతిక వాదిగా తయారయ్యారు. అయితే, ఆయన వేదాంత ప్రస్థానం చాల పొడుగైనది, క్లిష్టమైనది.

మొదట్లో ఆయనకి వంటచేసుకోవటం తెలియదు. అందుచేత, భిక్షాటనతో కాలం గడుపుకునేవారు. కాలినడకపై ఆయన అయోధ్య, మొరాదాబాదు వెళ్ళారు. టిక్కెట్టు లేకుండా హరిద్వార్ వెళ్ళారు. హిమాలయ పర్వతశ్రేణులు ఆయన్ని అమి తంగ ఆకర్షించాయి. హరిద్వార్ చేరుకున్నాక, తనతోటి విద్యార్థి యోగేష్‌కి ఒక సంకేత భాషలో వచన పద్యరూపంలో ఆయన ఒక ఉత్తరం వ్రాశారు. తరువాత ఆయన హృషికేశ్, దేవప్రయాగలకి ప్రయాణం చేశారు. దుర్గమాలైన పర్వత మార్గాలగుండా ప్రయాణంచేసి బదరీనాథ్, కేదారనాథ్, జమ్నోత్రి, గంగోత్రివంటి ప్రాంతాలని దర్శించారు. పర్యటించే సాధువులతోపాటు ఆయన గంజాయిపీల్చారు. కాని ఆ వ్యసనానికి బానిస మాత్రం కాలేదు. 1948 జనవరి 30 వ తారీఖున గాంధీజి హత్య తరువాత, గతంలో గాంధీజీని ధనికస్వామ్యవాదుల తొత్తు అని తమ 'వైజ్ఞానిక భౌతికవాద'లో విమర్శించిన రాహుల్, ఆ రోజునించి సెగరెట్టు ముట్టనని ప్రతిజ్ఞచేసి, ఆ ప్రతిజ్ఞని నిలపెట్టుకున్నారు. ఆయనకి మాంసాహారం అంటే ప్రీతి కాని మద్యపానం జోలికి ఆయన పోయేవారుకారు. ఆయన దృఢనిశ్చయాలు, నిశ్చి తాభిప్రాయాలు కల వ్యక్తి.

తమ పదహేనవ ఏట ఆయన చేసిన హిమాలయ పర్వతాల్లో పర్యటన ఆయన మనసుపై గాఢమైన ముద్రవేసింది. హిమాలయ పర్వతాలను దాటి, దుర్గమాలైన ప్రాంతాలకి ప్రయాణం చేయాలని ఆయన హృదయం తహతహలాడింది. కాశీకి తిరిగివచ్చి, ఆయన చక్రపాణి బ్రహ్మచారి ఆశ్రమంలో కొన్నాళ్లు ఉన్నారు. 1910వ సంవత్సరం అక్టోబరునెలలో సంస్కృతంలోని 'లఘుకౌముది' నేర్చుకోవటం మొదలుపెట్టారు. ఒకసారి, కాలినడకని ఆయన చూనార్, మిర్జాపూర్, అలహాబాదులలో పర్యటించారు. కాశిలో సంస్కృత గ్రంథాలని, ప్రాచీన కావ్యాలని, వ్యాకరణానికి, ఆయుర్వేదానికి, జ్యోతిశ్శాస్త్రానికి సంబంధించిన అనేక గ్రంథాలని అధ్యయనం చేశారు. ఎన్నో కష్టతరాలైన సిద్ధుల్ని, నామజపాల్ని, అనుష్ఠించి, ఆయన ఎందరో దేవతల ఆశీస్సుల్ని, అనుగ్రహాన్ని సంపాదించటానికి ప్రయత్నం చేశారు.

తమ పందొమ్మిదో ఏట పండిత రామావతార్‌శర్మ ఉపన్యాసం విన్నప్పటినించి ఆయనలో హేతువాదంపై, ఆసక్తి అన్వేషణ ప్రారంభం అయ్యాయి. పండిత శర్మ మహావిద్వాంసుడైనప్పటికి వేదాలని, దేవుణ్ని విశ్వసించినవారుకారు. రాహుల్ తమ పదవ ఏట దయానంద పాఠశాలలో ప్రవేశించారు. కాని పాఠశాలల్లో సాంప్రదాయక అధ్యయనం ఆయన జాతకంలో లేదు. పరస ఆశ్రమంలో ఆయన 'సాధు'గా మారారు. 'రామ్ ఉదార్‌దాస్'గా తమ పేరుని మార్చుకున్నారు. ఇక్కడకూడ మఠాధిపత్యానికి వారసుడైన సాధు గడిపే విలాస జీవితం వేళతప్పకుండా యాంత్రికంగా ఆశ్రమంలో జరిగే అర్చనల తాలూకు మంత్ర తంత్రాలు ఆయనకి నచ్చలేదు. 'సరస్వతి' అనే హిందీ పత్రికని, 'Dawan' అనే ఇంగ్లీషు పత్రికని చదవటం ప్రారంభించారు. సంస్కృతంలోను, హిందీలోను కొన్ని పుస్తకాల్ని కూడ ఆయన కొన్నారు.

ఆ ఆశ్రమంలో తమ అధ్యయనం కొనసాగించటానికి వీలులేక పోవటంవల్ల, కొన్ని మాసాలు గడపటానికి తమ స్వగ్రామం కనాయిలాకి ఆయన తిరిగివచ్చారు. కాని తమ చదువు సాగించాలనే కోరిక ప్రగాఢం కావటంవల్ల తమ కుగ్రామంలో (కూడ) అందుకు అవకాశాలు లేకపోవటంవల్ల, తమ ఇరవయ్యో ఏట మళ్ళీ పరాస్స ఆశ్రమానికి తిరిగి వచ్చారు. వేర్వేరు మాండలిక భాషలపైన, మానవ జాతి సంస్కృతీ అధ్యయనంపైన ఆయనకి అభిలాష అధికంగా ఉండేది. హిందీ భాషకి సంబంధించిన ఉచ్చారణా భేదాలని పరిశీలించి, హిందీలోని మాట్లాడే భాష తాలూకు కాశీకాలేక బనారసి విభాగంలోని 'భోజపురి' 'మాలి' వంటి

అంతర్భాగాల ఉచ్చరణా పద్ధతిని విభేదాలని పేర్కొన్నారు. అంతేకాక, అనేక కులాలికి చెందిన స్త్రీలు ఆచరించే ఆచార వ్యవహారాలిని, సంప్రదాయాల్ని ఆయన సవివరంగా చర్చించారు.

తమ విజ్ఞానపిపాస తీరకపోవటంతో, 1913వ సంవత్సరం జూలై నెలలో ఆయన మళ్ళీ పరాన్న ఆశ్రమం విడిచిపెట్టి వెళ్ళిపోయారు రైల్లో ఆయన హాజీపూర్ వెళ్ళారు. అక్కడినించి, టిక్కెట్టు లేకుండా, అసన్‌సోల్, ఆద్రా, ఖరగ్‌పూర్ గుండా ఆయన పూరి చేరుకున్నారు. ఈ యాత్రాస్థలాన్ని చూసిన తరువాత, ఆయన మదరాసు వెళ్ళారు. సాధుగా ఆయన అక్కడ కొన్నాళ్ళు ఒక సత్రంలో వెంకటేశ్వరుని దర్శనానికై కాలినడకని తిరుమలవెళ్ళి, అక్కడ ఉత్తరాది మఠంలో కొన్నాళ్ళు ఉన్నారు ఆయన తమిళ భాషని కూడ నేర్చుకోవటం మొదలు పెట్టారు. పున్నామల్లె, పచ్చపెరుమాళ్, తిరుమిషి, తిన్ననూర్ వంటి ప్రదేశాల్ని కూడ సందర్శించారు. సాధుగా ఆయన దక్షిణాదిలోని పుణ్యక్షేత్రాలన్నీ దర్శించారు. తిరుపతితోపాటు, ఆయన తిరుకళికుంద్రమ్, కాంచీపురం, రామేశ్వరం కూడ దర్శించారు.

తాను చూసిన ప్రదేశాల నన్నింటిని ఆయన తమ 'ఆత్మకథ'లో సవివరంగా వర్ణించారు. రామ్నాడ్, బెంగుళూరు, విజయనగరం, బగల్‌కోట, పండరీపురం, పూనా, బొంబాయి, నాసిక్, త్రియంబకం, కపిలధార, ఓంకారమాంధాత, ఉజ్జయినివంటి క్షేత్రాలని ఆయన సందర్శించారు. ఉజ్జయినిలో కుంభమేలాలో పాల్గొని, అక్కడ పేరుపడ్డ సాధువుల్లో రేకెత్తే పోటీలని, పేచీలని చూసి ఏవగించుకున్నారు. డకోర్, అహమ్మదాబాదులు కూడ దర్శించి ఆయన 1914 లో పరాశకి తిరిగి వచ్చారు. కాని ఆశ్రమం తాలూకు ఆ స్తికి సంబంధించిన పత్రాలని పరిరక్షించటం, ఆ ఆశ్రమ వ్యవహారాలని పరిశీలించటం వంటి పనులపై ఆయనకు ఆసక్తి లేకపోయింది. భారతప్రభుత్వం వారి పురాతత్వ శాఖకి చెందిన ఎస్. గంగూలి, పెండిదాస్ అనే ఇద్దరు ఛాయాగ్రాహకులు ఆ సమయంలో ఆ ఆశ్రమానికి రావటం తటస్థించింది. ఛాయాగ్రహణం ఆయన్ని ఎక్కువగా ఆకర్షించింది. ఛాయాగ్రహణం ఆయనకు తరువాతి రోజుల్లో ముఖ్యమైన వినోద కాలక్షేపంగా తయారయింది. ఆశ్రమంలో ఆయన జీవితం ఊపిరాడనంత యాంత్రికంగా మారింది. రహస్యంగా ఆయన ఆశ్రమాన్ని విడిచిపెట్టి అయోధ్య చేరుకున్నారు. అక్కడ ఆయన కొందరు ఆర్యసమాజ ప్రచారకుల్ని కలుసుకొని

ఉపన్యాసాలకి, చర్చలకి వేదిక అయిన ఒక సంఘాన్ని స్థాపించారు. అయోధ్య ఫైజాబాద్‌ల మధ్యవున్న ఒక కాళికాదేవి ఆలయంలో మేకల్ని బలియిస్తున్న ఒక బ్రహ్మచారి చర్యల్ని గర్హిస్తూ ఒక సమావేశాన్ని ఏర్పాటుచేశారు. ఆ సందర్భంలో, ఛాందసులైన మతాధిపతులు కొందరు ఆయన్ని కొట్టించటం జరిగింది. ఈ విషయాన్ని పోలీసులకి ఫిర్యాదు కూడ చేశారు. అప్పటికే ఆయన్ని 'ఆర్య సమాజవాది' అని, 'విగ్రహారాధనా వ్యతిరేకి' అని, 'నాస్తిక శిఖామణి' అనీ అందరు పిలవసాగారు.

1915, 1972 మధ్యకాలాన్ని రాహుల్ 'కొత్త కాంతికాలం' అని వ్యవహరించారు. తమ తాతగారు మరణించిన తరువాత, ఆయన తండ్రి రాహుల్ సంసారిగా మారి, ఒడుదుడుకులులేని ప్రశాంత జీవితాన్ని గడపుతారని ఆశించారు. కాని రాహుల్ త్వతః విప్లవమూర్తి. బుద్ధిపూర్వకంగా రాజపుత్రుల ఇళ్ళలోను, మహమ్మదీయుల లోగిళ్ళలోను ఆయన స్వంతంగా చేపలు వండుకుని భుజిస్తూండేవారు. ఆర్యసమాజానికి సంబంధించిన ఎన్నో పుస్తకాల్ని చదవటం ప్రారంభించారు. 1916వ సంవత్సరం జనవరి నెలలో ఆయన ఆగ్రా చేరుకుని ఆర్య ముఫాసిర్ విద్యాలయకలో ప్రవేశించారు. రెండు సంవత్సరాలపాటు ఆయన ఆ విద్యాలయంలో సంస్కృతం, అరెబ్బీభాష, అనేక మతాలకి సంబంధించిన సిద్ధాంతాల్ని, దేశ చరిత్రల్ని అధ్యయనం చేశారు. క్రమశిక్షణతో కూడిన ఈ జీవితం ఆయనలో సామాన్య జీవన విధానంపైన, అభిరుచిని కలిగించటమేకాక, ఆయనలో ఒక రకమైన అనిశ్చితమైన రాజకీయ చైతన్యాన్ని రేకెత్తించింది. ఈ రాజకీయ చైతన్యానికి ఆయన ఆ రోజుల్లో చదివిన వార్తాపత్రికలు కూడ దోహదం చేశాయి. 1916 లో కేదారనాథ్ విద్యార్థి ఆగ్రాలోని 'ముసాఫిర్' అనే పత్రికలో ఉర్దూభాషలో వ్యాసాలు వ్రాయటం మొదలు పెట్టారు. మీరట్ నించి వెలువడే 'భాస్కర్' అనే పత్రికలో రాహుల్ తమ మొదటి సుదీర్ఘ వ్యాసాన్ని హిందీలో వ్రాశారు. ఆ వ్యాసంలో గృహస్థుల్ని మోసగిస్తున్న సాధువుల్ని గురించి వివరించారు.

రాహుల్ విస్తృతంగా పుస్తక పఠనం ప్రారంభించారు. ఆర్యసమాజవాదులు సనాతన హిందూమతాన్ని దుయ్యబడుతూ రచించిన పుస్తకాలు, ఇస్లాం మత సిద్ధాంతాల్ని విమర్శిస్తూ ఉపన్యాస శైలిలో సాగిన వచన రచనతో క్రైస్తవ మిషనరీలు చేసిన రచనలు, మౌల్విసనానుల్లా రచించిన "అహ్లే-హెడిస్", ఇంకా మరికొన్ని కడియాని పత్రికలు ఆయన మొదట చదివిన పుస్తకాలలో కొన్ని.

వైష్ణవ మతగ్రంథాలనించి వైరాగ్య పద్ధతిలోని 'ఉదాసి' వర్గంవరకు, ఆశ్రమ పద్ధతినించి ఆర్యసమాజంవరకు, కులాల్లోని హెచ్చుతగ్గుల్ని నిరసిస్తూ ఆయన జరిపిన అభ్యుదయ పూర్వకమైన మానసిక ప్రస్థానం హేతువాదం వైపుసాగింది. 1915 లో జబల్‌పూర్‌లో మౌల్వీలకి ఆర్యసమాజానికి చెందిన పండితులకి మధ్య జరిగిన మత సంబంధమైన బహిరంగ చర్చని గురించి వ్రాస్తూ, ఆ చర్చలోపాల్గొన్న వాద, ప్రతివాదులు వారివారి గ్రంథాలలోని పంక్తుల్ని ఉదాహరిస్తూ, రెండురోజుల పాటు తీవ్రమైన వాగ్వివాదాలు చేశారని ఆయన తెలియజేశారు. తరువాత రోజుల్లో 'ఖురాన్'ని దేవనాగరి లిపిలో వ్రాసేపని. ఆ మతగ్రంథాన్ని హిందీలోకి అనువదించే పనికూడ ఆయనకి ఒప్పగించబడ్డాయి. కాని ఇందుకు లభించే ప్రతిఫలం అతిస్వల్పం. అందువలన ఆయన ఆ పనిని విడిచిపెట్టారు. ఆగ్రాలో విద్యార్థిగా ఉండగా కొమగాటుమారు సంఘటన జరిగింది. ఇందులో కొందరు సాహసికులైన శిక్కు యువకులు బ్రిటిష్ సామ్రాజ్యవాదుల్ని ఎదిరించి పోరాడారు. తమ ప్రాణాల్ని కోల్పోయారు. ఈ సంఘటన యువకులై, విప్లవ ధోరణివైపు మొగ్గు చూపుతున్న రాహుల్‌పై గాఢమైన ప్రభావం చూపి, ఆయన మనసుని కలచి వేసింది.

1916లో రాహుల్ సంస్కృతాధ్యయనం సాగిద్దామని నిర్ణయించుకుని లాహోర్ వెళ్ళారు. పంజాబి భాషతోటి, పంజాబి స్త్రీలతోటి వారి మొదటి పరిచయం చాలా ఆసక్తికరంగా జరిగింది. పంజాబులోని ఒక పల్లెటూరిపిల్లని చూసినప్పుడు, ఆయనకి 'గాథాసప్తశతి' జ్ఞాపకానికి వచ్చింది. ఆయన ఢిల్లీ, హర్యానాలగుండా ప్రయాణం చేశారు. ఆ రోజుల్లో లాహోరు ఆర్య సమాజ ఉద్యమానికి ప్రధానస్థావరంగా ఉండేది: వారి స్వేచ్ఛాపూరితమైన ఆలోచనాసరణి వారిని ఎక్కువగా ఆకర్షించింది. ఆశ్రమ జీవితాన్ని వాంఛించే సాధువుల్ని ఆయన విడచిపెట్టారు. ఆర్యసమాజం కూడా నిశ్చిత మూఢాభిప్రాయాల మయమై, దారి తెన్నూ లేని చీకటి మార్గంగా ఆయనకి కనిపించింది. ఎటావా, కాన్పూరు, లక్నోలలోని ఆర్యసమాజ కార్యాలయాన్ని ఎన్నో ఆయన సందర్శించాను. కాని ఈ 'ఆర్యయాత్రికుణ్ని' ఎవరూ ఆహ్వానించలేదు. రాయ్ బెరెల్లీలో హిందీభాష, సాహిత్యంపై ఆయన ఆశువుగా మహోపన్యాసం చేశారు. కాశీలోకూడ ఎన్నో ఉపన్యాసాలు చేశారు. అహరోరాలో ఆయన తండ్రి మళ్ళీ వచ్చి, తమ గ్రామానికి అక్కడి తమ పొలానికి తిరిగిరమ్మని ప్రాధేయపడ్డారు. కాని తాను ఒక పర్యాయం విడచిపెట్టిన జీవిన విధానానికి తిరిగి వెళ్లటానికి ఆయన అంగీకరించలేదు. ఆ

రోజుల్లో ఆయన తమ ఉత్తర ప్రత్యుత్తరాలన్నీ సంస్కృతంలో కొనసాగిస్తూ ఉండే వారు. 1922 వ సంవత్సరంలో ఫిబ్రవరి 13 వ తేదీనించి ఆగస్టు 9 వ తేదీవరకు బక్సార్ కారాగారంలో రాజకీయ ఖైదీగా ఉన్నప్పుడుకూడ ఆయన వ్రాసుకున్న డెయిరీలు సంస్కృతంలోనే ఉన్నాయి. కొన్ని సమయాల్లో సంస్కృతం, అరెబ్బీ ఉర్దూ, హిందీ భాషలలో కవిత్వం చెప్పటానికి కూడ ఆయన ప్రయత్నం చేశారు అహరోరానించి మళ్లీ పారిపోవటానికి ప్రయత్నంచేశారు. నిరాశతో కృంగిపోయిన ఆయన తండ్రి కాశీవరకు ఆయనతో వచ్చి, ఆయన మనసుని మార్చటానికి ప్రయత్నించారు. కాని కృతకృత్యులు కాలేకపోయారు. ఇదే తమ తండ్రితో ఆయన ఆఖరి సమావేశం. ఎన్నో సంవత్సరాలు ఆయనకి స్వంత ఇల్లు అంటూ ఏమీ లేక పోయింది. తమకి ఏభై ఏళ్లు వస్తేకాని తమ స్వంత జిల్లా అజమ్‌ఘర్‌కి తిరిగి రాకూడదని నిశ్చయించుకున్నారు. ఆ నిర్ణయానికి ఆయన కట్టుబడి ఉన్నారు.

1918 లో రష్యా విప్లవాన్ని గురించి ఉర్దూ, హిందీ, ఇంగ్లీషు భాషల లోని వార్తాపత్రికలలో చదివారు. New Atlantis, ఉటోపియా వంటి భూతల స్వర్గాల్ని గురించి, ఆదర్శవంతమైన కమ్యూనిస్టు సమాజాన్ని గురించి ఆయన కలలు కనటం మొదలుపెట్టారు. 1922 లో సంస్కృత శ్లోకాలలో ఈ వ్యవస్థకి సంబంధించిన రచన చిత్తుప్రతిని కూడ తయారుచేశారు. 1923, 24 సంవత్సరాల మధ్యకాలంలో తాము హజారిబాగ్ కారాగారంలో ఉన్నప్పుడు 'బైసవాఁ సదీ' (ఇరవై రెండో శతాబ్దం) అనే గ్రంథాన్ని రచించారు. ఆయన ఊహించిన సంపూర్ణ రాజకీయ ఆదర్శస్వప్నం గ్రంథరూపంలో మనకి ఇందులో సాక్షాత్కరిస్తుంది. 1919 లో ఏప్రిల్, మే నెలల మధ్యకాలంలో లాహోరులో మిలిటరి పరిపాలన రుచిచూడటం ఆయనకి రాజకీయాలతో కలిగిన మొదటి ప్రత్యక్షానుభవం. ఇది ఒక వినూతమైన సవాలు. ఈ సవాలుని ఎదుర్కొనటానికి సంస్కృతంలోని ఆధ్యాత్మిక పరిజ్ఞానం కాని, ఆర్యసమాజ సిద్ధాంతాలు కాని ఆయనకి ఎందుకూ కొర గాకుండాపోయాయి ఓ డయ్యర్ ప్రభుత్వపు తాలూకు చీకటిరోజులు బ్రిటిషువారిపై నిరసనతరంగాల్ని విజృంభించ చేశాయి. ఎందరో భారతీయుల ముఖాలపై నున్న తెరలు జారిపోతున్నాయి. అని రాహుల్ ఒకచోట వ్రాసుకున్నారు. తమ గట్టి నమ్మకాలవలన సంస్కృతానికి సంబంధించిన శాస్త్రపరీక్షలలో ఆయన కృతార్థులు కాలేకపోయారు. కాని చివరికి, కలకత్తా మీమాంస పరీక్షకోసం జబల్‌పూర్‌లో పరీక్షవ్రాసి, ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులయ్యారు.

పర్యటనలపై గాఢమైన కోరిక ఆయనలో మళ్లీ పొడసూపసాగింది. 1920 లో, తమ ఇరవైఏడవ ఏట, టిక్కెట్టు లేకుండా రాహుల్ కాశీ నించి బయలుదేరారు. వారణాసిలో అస్వస్థులయ్యారు. తరువాత, మొదటిసారిగా సారనాథ్ దర్శించారు. గోరఖ్‌పూర్‌నించి ఆయన బుద్ధుడు 'పరినిర్వాణము' చేసిన కాశియాకి వెళ్లారు. తమ 'ఆత్మకథ'లో తాము బౌద్ధక్షేత్రాలలో చేసిన యాత్రలని అత్యంత ఆనందంతో, కవితాత్మకంగా వర్ణించారు. గోరఖ్‌పూరు నించి నేపాలు వెళ్లి లుంబిని, కపిలవస్తు కూడ సందర్శించారు. నిగళిహార తటాకం సమీపంలో వున్న శిథిలమైన అశోకుడి శిలాశాసనం ఆయన్ని ఆకర్షించింది. భోటియాలు నివసించే ప్రాంతాలు దర్శించాలనే కోరిక ఆయనకి కలిగింది. అందువలనే, నేపాలులోని ఒక మఠాచార్యుడు ఆయనని తమ శిష్యుడిగా చేరమన్న కోరికని ఆయన అంగీకరించలేకపోయారు. ఈ మఠాచార్యులు గంజాయి పీలుస్తూ, విచ్చలవిడిగా తిరిగే యోగినులతో కావించే ప్రేమకలాపాన్ని నిశితంగా విమర్శించారు.

సాహసోపేతము, ఒక్కొక్కసారి దుస్సాహసం అని కూడ అనిపిస్తూ, ఆసక్తికరమూ అయిన ఆయన జీవితగాథని వివరించేముందు, టిబెట్‌లో ఆయన నాలుగుసార్లు చేసిన యాత్రల్ని, ఆయన రాజకీయ జీవితాన్ని సంక్షిప్తంగా తెలియజేయవలసి ఉంది. 1921-27 మధ్య కాలంలో తన జీవితాన్ని ఆయన 'రాజకీయ రంగప్రవేశం' అని అభివర్ణించారు. మొదటిసారి 1921లో ఖాండ్‌నాలో సహాయ నిరాకరణోద్యమం సందర్భంలో తాను రాజకీయ ఉపన్యాసం చేశామని తెలియజేశారు. కాషాయవస్త్రాలు ధరించి సాధువు రూపంలో ఆయన సతీమ్‌పూరులోని జిల్లా కాంగ్రెసు కమిటీ కార్యాలయానికి వెళ్ళి పరాశలో రాజకీయ కార్యక్రమాన్ని ఆరంభిస్తామని ప్రకటించారు. ఆశ్రమాలలోని భక్తుల మూఢ విశ్వాసాలకు సంబంధించిన ఒక సంఘటనని ఆయన వ్యంగ్యధోరణిలో తెలియజేశారు. మూఢ విశ్వాసంతో కొందరు భక్తులు దైవాంశ సంభూతులు అని విశ్వసించబడే కొందరి ప్రీతికోసమని జంతుబలులు, గంజాయి, మద్యం సమర్పించటం మానక పోయిన సందర్భంలో, ఒక రోజు తమని గాంధి అనే కొత్తదేవుడు ఆవహించాడని నటిస్తూ, 'ఇప్పుడు దేవుళ్ళంతా గాంధి అనే కొత్త బాబాతో కలసిపోయారు. గంజాయి, మద్యం, జంతుబలి సమర్పించిన వాళ్ళంతా సర్వనాశనం అయిపోతారు. ఇదే నా శాపం' అని గర్జించారు. దాంతో వాళ్ళంతా భయపడి, తమ మూఢ విశ్వాసాల్ని విడిచిపెట్టటం జరిగింది. సాధువుగా మారిన రాహుల్ ఛాప్రా

లోని వరధాబాధితులైన బీదప్రజలకి సహాయంచేయటంలో నిమగ్నులయ్యారు. ఆ రోజుల్లో సాంఘికసేవ, జాతీయోద్యమం రెండు విభిన్నమైన కార్యక్రమాలుగా ఉండేవికావు. గాంధిపాఠశాలని కేంద్రంగా చేసుకుని, ఎక్కాలో ఆయన రాట్నా లని పంచిపెట్టారు. భోజపురిభాషలో విదేశీయుల పరిపాలనపట్ల తీవ్రమైన అసంతృప్తిని వెల్లడిస్తూ ఉపన్యాసాలు చేశారు. 1922వ సంవత్సరం జనవరి 31న ఆయన అరెస్టు చేయబడ్డారు. కారాగారంలోకి రహస్యంగా ట్రాట్స్కీ రచించిన "బోల్షెవిజమ్ - ప్రపంచ విప్లవం' అనే గ్రంథాన్ని తెప్పించుకున్నారు. జైల్లోనే, ఆయన సంస్కృతంలో ఒక రాజకీయ భజనగీతాన్ని రచించి, తోటి కారాగార వాసులకి ఉత్సాహం కలిగించటానికి గొంతెత్తి ఇలా పాడుదూ ఉండేవారు.

శృణు: శృణు రే పంథ్,
అహ మిహ నః ఏకాకి !
(వినుమోయి, వినుమోయి, బాటసారీ !
ఏకాకిని కాదు నేను ఏనాటికీ !

తన నేరాన్ని అంగీకరించిన మీదట, రాహుల్‌కి ఆరునెలలు సాధారణ కారాగారవాస శిక్ష విధించబడింది. 'ధన్యవాదాలు!' అన్నారు రాహుల్. ఆయన చేతులకి ఇనుప సంకెళ్లు బిగించబడ్డాయి. ఈ విషయాన్ని ముచ్చటిస్తూ ఆయన ఇలా వ్రాశారు. 'నా రెండు చేతులకి మా తాతగారు వెండి మురుగులు తొడిగి నప్పుడు కూడ అవి చేతిసంకెళ్ళలాగే నేను భావించాను. వీటి రెండింటి మధ్య భేదం ఏమిటంటే, ఈ ఇనప సంకెళ్ళతో పనులు చేసుకోవడం కష్టం' బక్సర్ జైల్లో ఆయన గడపిన ఆరునెలల కాలంలో బ్రజభాషలో 'షైళ్ళ'ని గురించి 'నలుపు'ని గురించి ఆశుకవిత్వం రచించారు. భరతేందు హరిశ్చంద్ర రచించిన అంధేర్ నగరి' అనే నాటకాన్ని కూడ ప్రదర్శించారు. జైలులోనే రాహుల్ ఖురాన్ గ్రంథాన్ని సంస్కృతంలోకి అనువదించటం ప్రారంభించారు. తోటి ఖైదీ లకి ఆయన ఉపనిషత్తులు, వేదాంతం బోధించారు. జైలులోని ఈ కార్య క్రమాలు బయటి ప్రపంచానికి చేరవేయబడ్డాయి మజహీరుల్ హఖ్ 'మదర్ లాండ్' అనే తమ పత్రికలో ఈ విషయాన్ని ప్రచురించారు.

1922 వ సంవత్సరం అక్టోబరు 29 న ఆయన జిల్లాకాంగ్రెసు కార్య దర్శిగ ఎన్నుకోబడ్డారు. కాంగ్రెసుపార్టీ గయాసమావేశాల్లో రాజాజీ వర్గంవారు మార్పుని మాత్రం అంగీకరింపని వారుగ వ్యవహరించటం వలన, రాజాజీని

'ఉపమహాత్మ' అని పిలవసాగారు. రెండో వర్గానికి స్వరాజ్ పార్టీలోని మోతి లాల్ నెహ్రూ, విఠల్ భాయ్ పటేల్, దేశబంధు చిత్తరంజన్‌దాస్ వంటి వారు నాయకులు. విప్లవభావాలతో కూడిన కమ్యూనిజం వైపు రాహుల్ కొద్దికొద్దిగా మొగ్గు చూపించసాగారు పూర్తిగా మతాతీతవ్యక్తి అవటమే కాకుండా, నాస్తి కులు కూడ కాసాగారు. గయా కాంగ్రెసులో కొందరు జాతీయ నాయకులతో పాటు, బుద్ధగయలోని ఆలయాన్ని సనాతన హిందువులనించి, బౌద్ధులకి అంద జేయాలని వాదించారు. 1923 మార్చి-ఏప్రిలు మధ్యకాలంలో ఒకటిన్నర నెలలు నేపాలులో ఉన్నారు. ఆ రోజుల్లో శివరాత్రినాడు పశుపతినాథ దర్శనానికి మాత్రమే హిందూ యాత్రికులు అనుమతించబడేవారు. ఇక్కడ బౌద్ధ పండితుల తోటి, భిక్షువుల చైనా, మంగోలియా దేశాలకి చెందిన లామాలతోటి పరిచయం ఏర్పరుచుకున్నారు.

నేపాలునించి తిరిగిరాగానే, రాహుల్ మళ్ళీ నిర్బంధించబడ్డారు. బంకి పూరు జైలులో ఏకాంత కారాగారవాస శిక్ష ఆయనకి విధించబడింది. తరువాత, అక్కడనించి ఆయన హజారిబాగు జైలుకి తరలించబడ్డారు. ఈ జైలులో ఆయన రెండు సంవత్సరాలు గడపవలసి వచ్చింది. ఈ సమయంలో ఆయన దగ్గర సింహళభాషా లిపిలోవున్న పాళిభాషలోని 'మాఝిమ్‌నికాయ' అనే గ్రంథం ప్రతి ఉండేది. ఆ గ్రంథాన్ని ఆయన ప్రతినిత్యం పఠిస్తూ ఉండేవారు. ఆ పుస్త కాన్ని పోలీసువారి ఆధీనంనించి విడిపింప చేయటానికి ఆయన రెండురోజులు ఉపవాసదీక్ష వహించవలసి వచ్చింది. ఏ కాగితం కాని, పెన్సిలు కాని, పెన్ను కాని ఖైదులో ఉంచుకోటానికి అనుమతి లభించేది కాదు. కాని ఆయన ఎలాగో ఒక పలక సంపాదించుకుని గణితం, ఆల్జీబ్రా. ఆప్టెక్సు (వెలుతురుకి సంబంధించిన శాస్త్రం). ఖగోళ శాస్త్రాలలోని తమ విజ్ఞానాన్ని పునశ్చరణ చేసుకోసాగారు. ఇందులో శంకరాచార్య అనే కేరళ ప్రాంతానికి చెందిన తోటిఖైదీ ఆయనతో సహకరించాడు. ఆ జైలు అధికారి ఆంగ్లో-ఇండియను; మంచి ఉదార స్వభా వుడు. పిల్లలకి సంబంధించిన కొన్ని పుస్తకాల్ని అతడు పంపిస్తే, రాహుల్ వాటిని చదివి అందరికి వినిపించేవాడు. పెద్దపెద్ద ఖగోళ చిత్రాలని గీస్తూ ఉండేవారు. సాహసకృత్యాలకి, అపరాధ పరిశోధనకి సంబంధించిన నాలుగు ఇంగ్లీషు నవలల్ని ఈ సమయంలో ఆయన హిందీలోకి అనువాదం చేశారు. ఈ రోజుల్లోనే ఫ్రెంచి, అవెస్తాన్ భాషల్ని కూడ ఆయన నేర్చుకున్నారు.

1926 లో ఆయన మీరట్‌లో హర్నామ్‌దాసుని కలుసుకున్నారు. ఈయన కొంతకాలం తరువాత విశ్వనాథ బ్రహ్మచారిగాను, ప్రస్తుతం ఆనంద కౌసల్యాయన్

భిక్షువుగాను మారారు. ఆయనతో రాహుల్‌కి అతి సన్నిహితమైన చిరకాల స్నేహం ఏర్పడింది. తరువాత, ఆయన కాశ్మీరు, కార్గిల్ ద్వారా లడాఖ్ వెళ్ళి హిమిస్‌దగ్గర సత్సంగ్‌రాస్-పా అనే లామాని కలుసుకున్నారు. కల్పిలో ఆయన కొంత వశీకరణ విద్యని నేర్చుకుని, ఈ లామాలలో కొందరికి స్వయం సూచనల్ని చేస్తూ, వాళ్ళపై ఈ విద్యని ప్రదర్శించారు. తరువాత పద్దెనిమిదివేల అడుగుల ఎత్తుని ఉన్న ఖార్‌డొంగ్-లాకి వెళ్ళి, అరవై ఏళ్ళ వృద్ధుడు జోంగ్ లామాని దర్శించారు. నూబ్రానించి లేహ్‌కి కూడ ఆయన వెళ్ళారు. మాన్-పాంగ్-గాంగ్ సరస్సు చుమూర్తి-కినౌర్ మార్గంద్వారా ఆయన సిమ్లాకి తిరిగి వచ్చారు. టిబెట్ సరిహద్దుల్లో, దేశదిమ్మర్లు మాత్రమే చేయగలిగిన దుస్సాధ్యమైన ప్రయాణాల్ని రాహుల్ 1926 లో మొదలు పెట్టారు. దుర్గమ మార్గాలలో తనతో ప్రయాణం చేసిన సేంగ్-టుక్ అనే కుక్క మరణాన్ని ఆయన హృదయంగమంగా ఇలా వర్ణించారు: "నాకు అత్యంత ప్రీతిపాత్రులైన నా తండ్రి, తాతలు మరణించినప్పుడు కూడ అశ్రువులు రాల్చని నా కళ్ళు, చిన్నారి కుక్కపిల్ల మరణించినప్పుడు, ఆపుకోలేని అశ్రువులతో నిండిపోయాయి. ఈ శునకం మరణంపై స్మృతిగీతాలుగా సంస్కృతంలో ఎనిమిది శ్లోకాలు రచించాను, ప్రతి శ్లోకం 'సేంగ్-టుకె త్వత్ప్రయాణె!' అని ముగుస్తుంది".

పశ్చిమ టిబెట్‌ని మొదటిసారి దర్శించిన తరవాత, రాహుల్ బుషాహర్ రాష్ట్రానికి, సున్నామ్, కనమ్, చిని, స్పెటి ప్రాంతాలకి వచ్చారు. కోటద్వారవద్ద మిస్టర్ స్టోక్స్ అనే ఏపిల్‌తోట యజమానిని కలుసుకొని, అక్కడనించి సిమ్లాకి వచ్చారు. బీహారుకి తిరిగి వచ్చాక, ఆయన ముమ్మరంగా రాజకీయాల్లో పాల్గొనసాగారు. రాజేంద్రప్రసాదుతో కలిసి రైతుల సభల్లో ఛాప్రా అనే మాండలిక భాషలో ఆయన ఉపన్యసించారు. 1926 లో గౌహతి కాంగ్రెసు సమావేశాలలో పాల్గొన్నారు. ఫరీదాపూరులో మజ్రహుల్‌హక్‌ని కలుసుకున్నప్పుడు, ఎన్నో ఆధ్యాత్మిక గ్రంథాలు ఉన్న ఆయన గ్రంథాలయాన్ని చూడటం తటస్థించింది. 1927 మార్చి 30 న ఆయన చివరిసారిగా పరాశకివెళ్ళి, జమీందారీ విధానం రద్దు అయ్యే వరకు, ఆ గ్రామానికి తిరిగిరానని శపథం చేశారు.

కలకత్తాలోని మహాబోధి సంఘం సహాయంతో రాహుల్ 'విద్యాలంకార ప్రవీణ'లో చేరటానికి శ్రీలంక వెళ్ళారు. 1927 మే 16 నించి 1928 డిసెంబరు 1 వరకు, పంధొమ్మిది నెలలుపాటు ఆయన బౌద్ధమత గ్రంథాలని అధ్యయనం

చేశారు. భారతదేశ సంస్కృతికి సంబంధించిన చరిత్రని గురించి విస్తారమైన విజ్ఞానాన్ని సేకరించుకున్నారు. హజారిబాగ్ జైలులో ఆయన బ్రాహ్మీలిపిని నేర్చుకుని 'ఎపిగ్రాఫికా ఇండికా'లోని ప్రాచీనకాలపు అంకెలని పరిశీలించ గలిగారు. సింహళంలో ఉండగా, 'పాళి పుస్తక సంఘం', లండన్‌లో రాయల్ ఏసియాటిక్ సొసైటీవారు బొంబాయి, బెంగాలు, శ్రీలంకలోని వారి శాఖలద్వారా విడుదలచేసిన ప్రచురణలు ఆయనని ముఖ్యంగా ఆకర్షించాయి. భగవంతునిపై వైదిక సంబంధమైన ఆయన విశ్వాసాన్ని బౌద్ధమత విశ్వాసాలతో సమన్వయ పర చటానికి మొదట్లో ఆయన ప్రయత్నం చేశారు. కాని ఆ విధమైన సహజీవనం ఎక్కువకాలం నిలవలేదు. సర్. డి, వి. జయతిలకె ఆయనకి కావలసిన పుస్తకా లన్నీ అందజేస్తూ ఉండేవారు. 1927 డిసెంబరులో మదరాసులో జరిగిన భారత జాతీయ కాంగ్రెసు సమావేశాల తరువాత రాజేంద్రప్రసాదు సింహళ ద్వీపాన్ని సందర్శించినప్పుడు రాహుల్ ఆయనకి గైడుగా సహాయపడ్డారు. ఈ సమయంలోనే, రాహుల్ రచయితగా తమ జీవితాన్ని ప్రారంభించారు. అలహాబాదునించి ప్రచు రించబడే 'సరస్వతి' అనే హిందీ మాస పత్రికలో సింహళ దేశాన్ని గురించి కొన్ని వ్యాసాలు వ్రాశారు. స్థానికులైన విద్యార్థులు కొందరికి ఆయన సంస్కృతంలో ప్రత్యేక శిక్షణకూడ ఇచ్చేవారు. సింహళ భాషని, ఫ్రెంచిని ఆయన నేర్చుకున్నారు. టిబెట్‌కి వెళ్ళాలనే ప్రగాఢమైన వాంఛతో ఆయన భారతదేశానికి వచ్చారు.

1, 29, 1934, 1936, 1938 సంవత్సరాలలో రాహుల్ టిబెట్ నాలుగు సార్లు దర్శించారు. భక్తియార్ ఖిలీ తన దోపిడి మూకలతో బీహారులోని నలంద, విక్రమశాల విశ్వవిద్యాలయాల్ని ముట్టడించినప్పుడు, బౌద్ధ భిక్షువులు ప్రాణరక్షణ కోసం తమ వ్రాత ప్రతులతోటి, తాళపత్ర గ్రంథాలతోటి నేపాలు, అస్సాము, టిబెట్ ప్రాంతాలికి పారిపోయారు. భారత దేశానికి సంబంధించిన అనేక గ్రంథా లయాలు, ఆశ్రమాలు ధ్వంసం చేయబడి, అగ్నికి ఆహుతి చేయబడినప్పుడు, శిల్పాల్లోను, వర్ణ చిత్రాలలో భద్రపరచబడ్డ భారతీయ శిల్పశాస్త్రం తాళ్ళ పత్ర గ్రంథాల ద్వారా మత గ్రంథాలకి ఉన్న చెక్కలతో చేయబడ్డ అట్టమీద ఉన్న బొమ్మలు, రేఖా చిత్రాల ద్వారా టిబెట్టుకి చేర్చబడ్డాయి. ఈ శిల్పకళ శిల్కు టంకాలు అనే కొత్త మాధ్యంమీదకి పరివర్తించబడింది. భారతదేశపు రేఖాచిత్రాలు, చైనాదేశపు ప్రకృతిదృశ్య చిత్రాలు వజ్రయాని దేవతామూర్తుల తోటి స్థానికజానపద విజ్ఞానంతోటి సమన్వయం చేయబడ్డాయి. తాళపత్ర

వ్రాతప్రతులు ఏడవశతాబ్దంలో భారతదేశంనించి టిబెట్ వెళ్ళాయి. టిబెట్ సార్వభౌముడైన స్రాంగ్ - వాత్సన్ - సామ్ - సో (క్రీ. శ. 630–69) ఆ స్థానంలో ఆ గ్రంథాలని గురించి ప్రస్తావన ఉంది. తొమ్మిదో శతాబ్దంనించి పదమూడో శతాబ్దం వరకు ఈ పద్ధతి కొనసాగింది. ఈ కాలంలో అనేకవేల సంస్కృత, పాళీగ్రంథాలు భోట్ భాషలోకి తర్జుమాచేయిబడ్డాయి. ఈ గ్రంథాలకి సంబంధించిన జ్ఞానం బౌద్ధమతం గురించి, మతతత్వం గురించి కొత్త విషయాలని వెలువరించటమే కాక, మనదేశంలో లభ్యంకాని గ్రంథాలు కొన్ని టిబెట్ లామాల ఆశ్రమాలలో భద్రపరచబడటంవలన, వైదికమత, జైనమత సంప్రదాయాలు కూడా ఇంకా ఎక్కువ తెలుస్తాయి. కాంజూరు, టాంజూరులలోనే పది వేల వరకు అటువంటి గ్రంథాలు భద్రపరచబడ్డాయి. రాహుల్ చేసిన నాలుగు యాత్రలు టిబెట్‌నించి విలువైన ఈ గ్రంథాలు చాలవరకు భారతదేశానికి తీసుకురావటానికి ఉపకరించాయి. టిబెట్ భాషకి సంస్కృత భాషలో వ్యాకరణం రచించటంలోను. ప్రాథమిక పాఠ్యపుస్తక రచనలోను రాహుల్ మార్గదర్శకులయ్యారు. అంతేకాక, ప్రఖ్యాత బౌద్ధతార్కికులైన దర్మకేరి, సుబంధు, అసంగ వంటి వారి రచనలని సంరక్షించటంలోను, పునఃసృష్టి చేయటంలోను, ఆయన అద్వితీయమైన కృషిచేశారు. తరువాత కాలంలో, 'బౌద్ధ తర్కం' అనే గ్రంథాన్ని రచించిన ప్రఖ్యాత రష్యన్ విద్వాంసుడు ప్రొఫెసరు షేర్‌బాట్స్కి, లెనిన్‌గ్రాడ్ విశ్వవిద్యాలయంలోని తన జ్ఞాపకాల్లో, తమ తరువాత ఆ బౌద్ధతర్కాన్ని బోధించ గలిగిన వ్యక్తి ప్రపంచంలోకెల్లా రాహుల్ ఒక్కరే అని వ్రాశారు. బౌద్ధమత విద్వాంసుడిగా ఆయనని లెనిన్‌గ్రాడ్ విశ్వవిద్యాలయంవారు ఆహ్వానించారు. లెనిన్‌గ్రాడ్ విశ్వవిద్యాలయంలో ఆయన బోధించారు. తమ అవసానదశలో, ఆయన శ్రీలంక విద్యాలంకార విశ్వవిద్యాలయంలో కూడ అధ్యాపకవృత్తి నిర్వహించారు. కాని ఆయన జీవితకాలంలో ఆయనకి ఏ డిగ్రీ లేకపోవటంవల్ల, ఏ విశ్వవిద్యాలయంవారు బోధించటానికి ఆహ్వానించనూ లేదు. అనుమతించనూ లేదు. మన విశ్వవిద్యాలయంలోని సంకుచిత విద్యానిర్వహణపై ఎంత విచారకరమైన వ్యాఖ్య!

1928 లో టిబెట్‌కి వెళ్ళటం అంత సులభసాధ్యమైన విషయంకాదు. నేపాలు ద్వారా రహస్యంగా వెళ్ళడం ఒక్కటేమార్గం. శివరాత్రి యాత్రికుల సహాయంతో రక్‌సౌల్, అమ్లేఖ్‌గంజ్‌ల ద్వారా ఆయన నేపాలు చేరుకున్నారు, టాపులేని లారీలో ఖాట్మండు వెళ్ళారు. ఖాట్మండులోని మహాబౌద్ధస్థూపం దగ్గర

దూక్ - పాదులామాని కలుసుకున్నారు. లడాఖ్‌లోని హెమిస్‌లామా దగ్గరనించి మంచి సిఫారసు పత్రాన్ని రాహుల్ తీసుకుని వచ్చారు. ఇక్కడ రాహుల్ నేపాలీగామారి, దుక్ - పాలామా శిష్యులలో జేరడానికి ప్రయత్నించారు. కాని రాహుల్ ఉన్న ఎల్మాన్‌కి లామా వెళ్ళలేదు; లామా గ్నేనామ్‌కి వెళ్ళారు. టిబెట్‌కి చెందిన వ్యాపారస్థుల్ని కొందరిని ఆయన కలుసుకున్నారు. వ్యాపారానికై ప్రయాణంచేసే ఈ టిబెట్‌వారు 'యాక్' అనే ఎద్దులమీద ఉప్పుని తీసుకువెళ్ళి, నేపాలులో బియ్యానికి, ధాన్యానికి మార్పిడి చేసేవారు. రాహుల్ దుక్ - పా లామాని కలుసుకొని, భట్కోసి తటపాణిల ద్వారా వారి బృందంలో చేరారు. నేపాలు సరిహద్దు సైనికులు వారిని ప్రశ్నలతో వేధించాడు, తమపేరు ఛేవాంగ్ అని, ఖున్ను (కినౌర్) లో జన్మించామని, రాంగ్ లామా అవతారానికి తాము శిష్యులమని జవాబు ఇచ్చారు. దుక్ - పా లామా జ్ఞానమ్‌లో నివాసం ఏర్పరుచుకుని శిష్యులు సమర్పించే కానుకల్ని స్వీకరించటంలో నిమగ్నులై పోయారు. టిబెట్‌కి వెళ్ళాలనే కోర్కెతో రాహుల్ ఓర్పు కోల్పోయారు. సరిహద్దు భూమిని దాటడానికి అవసరమైని అనుమతి (లామ్ - చిక్) లభించటం రాహుల్‌కి పెద్ద సమస్యగా పరిణమించింది. బోధ్‌గయలో గతంలో ఒక మంగోలు భిక్షువుని కలుసుకుని ఉన్నారు. అదృష్టవశాత్తు, ఆయన ఆ భిక్షువుని అక్కడ కలుసుకోవటం తటస్థించింది. ఆయన వెంటనే రెండు అనుమతి పత్రాలని తీసుకువచ్చారు. రాహుల్ లోబ్‌జాద్‌షెరామ్ (సంస్కృతంలోకి అనువదిస్తే ఈ పేరుకి 'సుమతి ప్రజ్ఞ' అని అర్థం)తో పాటు తమ ప్రయాణం ప్రారంభించారు. తన బరువైన సామానంతా బుజాలపై మోయవలసి వచ్చింది. దారిలో కొందరు కూలీలని ఈ పనికి కుదుర్చుకున్నారు. కాని ఆ దారిలో బందిపోటు దొంగలు ఉండటంవల్ల అంత సురక్షితమైనది కాదు. ఎవరైనా కొత్తవాడు బందిపోటు దొంగలా కనిపిస్తే, తనటోపీని తీసి, నాలికచూపించి, 'కుఛి కుఛి' (దయ వుంచండి) అని వారిని ప్రాధేయపడుతూ, బిచ్చం వేయమన్నట్లు చేతులు చాస్తూ ఉండేవారు. వ్యాపారస్థులు చాలమంది ఇలాగే లామాలుగాను, సాధువులుగాను నటిస్తూ విలువైన వస్తువుల్ని తమతో తీసుకువెళ్ళేవారు. సామాన్యంగా ఈ బందిపోటు దొంగలు ప్రయాణీకుల్ని ముందు చంపి, తరవాత వాళ్ళదగ్గరఉన్న సామానుల్ని పరీక్షించేవారు. అదృష్టవశాత్తు, ఎలాగో కోసినదిలోని మంచు లాంటి నీటిని దాటి, షేకర్ చేరుకున్నారు. అక్కడ లార్చే దాక తమ సామానుల్ని తీసుకువెళ్లటానికి కొన్ని గాడిదలు దొరికాయి. బ్రహ్మపుత్ర నది

ఒడ్డున రాహుల్ ఒక చిన్న గుఱ్ఱంమీద నెమ్మదిగా ప్రయాణం చేస్తూ నార్థాంగ్ చేరుకున్నారు. ఈ ఆశ్రమంలో టిబెటన్ భాషలోకి తర్జుమాచేయబడిన, 11-వ శతాబ్దం తాలూకు 338 భారతీయ గ్రంథాలు ఉన్నాయి. తాషిలుంపోగుంబా చేరుకుని, గతంలో చైనాకి పారిపోయిన తాషిలామాని కలుసుకున్నారు. డలైలామా తరవాత ఈయనే అత్యంత ప్రాముఖ్యం కల మతాధికారి. షిగార్చి నించి, రాహుల్ దికి-థోమో, జరాల కనుమ, నగాచె, దండె—ఖామ్-వాలాల ద్వారా చిన్న గుఱ్ఱంమీద ప్రయాణం చేస్తూ లాసా చేరుకున్నారు. ఛూ-డీరి దగ్గర ఒక చిన్నపడవలో బ్రహ్మపుత్రని దాటారు. 1929 జూలై 19 న పోతాల అరామానికి చెందిన బంగారు శిఖరాన్ని దూరంనించి రాహుల్ దర్శించారు. మూడు గంటల కాలినడక తరవాత, ఆయన ధర్మసాహుభవనం చేరుకున్నారు. అందరూ ఆయన్ని సాదరంగా ఆహ్వానించారు. గతంలో రాహుల్ ధర్మసాహుని నేపాలులో దర్శించారు. వారిదగ్గర నించి వారి కుమారులు పూర్ణమాన్, జ్ఞానమాన్ సాహులకి లేఖలని ఆయన తీసుకుని వచ్చారు.

చిట్టచివరికి, టిబెట్ ముఖ్యపట్టణం లాసా చేరుకున్నారు. కాని ఆయన ఏ దేశాలనించి అక్కడికి చేరుకున్నారో బ్రిటిషు ప్రభుత్వానికి తెలియలేదు. టిబెట్ దేశం విదేశీయులంటే ఇష్టపడేదికాదు. అందుచేత, తాను బౌద్ధభిక్షువుగా డలైలామాకి పరిచయం చేసుకోవాలని రాహుల్ అనుకున్నారు. 151 సంస్కృత శ్లోకాలని రచించి, వాటిని భోట్ భాషలోకి అనువదింపచేసి, అందమైన సొంత దస్తూరితో వాటిని వ్రాసి, డలైలామాకి సన్నిహితుడైన న్గిరి-ఖాంగ్ ద్వారా రాహుల్ ఆయనకి పంపించారు. డలైలామా చాలా సంతోషించి, ఏదో ఒకరోజు ఆహ్వానం పంపిస్తామని అన్నారు. కాని ఆ సంగతి పూర్తిగా మరిచిపోయారు. రాహుల్ దేపుంగ్‌గుంబాకి వెళ్లారు. అక్కడ ఎన్నో 'ఖామ్‌జాన్స్' (ఆశ్రమశాలల)లో వివిధదేశాలకి చెందిన ఏడువేలమంది భిక్షువులు నివసిస్తున్నారు. కాని భారతీయులకి ఏ ఆశ్రమశాల లేదు. 16 వేల భోట్ పదాలని సేకరించి, వాటి అర్థాలని చిన్న కాగితం ముక్కలమీద నేపాలు, సంస్కృత భాషలలో వ్రాసుకున్నారు. మొదట్లో ఆయన అక్కడ మూడు ఏళ్లు ఉండి, టిబెటన్ భాషలోనే ఉన్న బౌద్ధ మత గ్రంథాలని బైటికితీసి, అధ్యయనం చేయాలనే కోరికతో అక్కడికి వచ్చారు. కాని ఇందుకు ఆర్థికమైన ఇబ్బందులు అడ్డువచ్చాయి. కాశీ విద్యాలయంలోని ఆచార్య నరేంద్రదేవ్ నెలకి ఏభై రూపాయిలు ఉపకారవేతనాన్ని ఏర్పాటుచేశారు. అరుదైన పుస్తకాల్ని 'టంకా' చిత్రాల్ని కొనడానికి బాధాంత ఆనంద కౌసల్యాయన్

సింహళం నించి మూడువేల రూపాయిలు పంపించగలిగారు. అంత వృద్ధుడైన మహావీరుని దర్శించటానికి సామ్యే వెళ్లారు. నలందాకి చెందిన శాంతి–రక్షిత భిక్షువు మృతశరీరం అక్కడే భద్రపరచబడింది. కాని అప్పటికి ఆ ఆరామం శిథిల మైపోయింది. భారతీయ విద్వాంసులు 11 వ శతాబ్దంలో నివసించి, సంస్కృత గ్రంథాలని టిబెటన్ భాషలోకి తర్జుమాచేసిన గయ-గర్‌లింగ్ (భారతదేశపు మంచుభూమి) కూడ ఆ సమయానికి శిథిలావస్థలో ఉంది. దీపాంకర్ స్పృజ్ఞాన్ కథనం ప్రకారం, ఈ ఆరామంలో విక్రమశిలలో సైతం లభ్యంకాని అరుదైన పుస్తకాలు కొన్ని ఉండేవి. కాని ఈ గ్రంథాలయం చాలాకాలం కింద అగ్నికి ఆహుతి అయిపోయింది. రాహుల్‌కి ఒక సంస్కృత గ్రంథమయినా దొరకలేదు. టిబెటన్ భాషలోని కొన్ని వ్రాతప్రతుల్ని, చిత్రాలని మాత్రమే ఆయన తీసుకుని రాగలిగారు. ఆయన సేకరించిన సరంజామాని పద్దెనిమిది చిన్న గుర్రాలమీదికి ఎక్కించి కాలింపాంగుకి తీసుకుని వచ్చారు. కొన్ని పుస్తకాల్ని మార్గమధ్యంలో ఆయనకి కొందరు బహూకరించేవారు. కొన్ని పుస్తకాల్ని ఆయన శాలువిహార్, శాషాలుంపో, నార్థాంగ్, జ్ఞ్యాంచి అనే ప్రదేశాలలో కొనుగోలుచేశారు. 'కాంజూరు', 'టాంజూరు' మాత్రమేకాక, ఆయన టిబెటన్ భాషలోని మరో 1619 వ్రాత ప్రతుల్ని కొన్నారు. లాసానించి కాలింపాగుకి ఆయన తిరుగుప్రయాణం 1930 సంవత్సరంలో ఏప్రిల్ 24 నించి జూన్ 3 వరకు 39 రోజులు పట్టింది. ఈ గ్రంథాలని, వ్రాతప్రతులని ఆయన పాట్నా మ్యూజియమ్‌లోకి బహూకరించారు. ఇవి అన్నీ ఆ మ్యూజియమ్‌లోని కాశీప్రసాద్ జైస్వాల్ భవనంలో భద్రపరచ బడ్డాయి.

టిబెటన్ త్రిపీటకాలలోని 'తంత్ర', 'సూత్ర' గ్రంథాలు జపానులో మాత్రమే 1936 లో ప్రచురించబడ్డాయి. ఆయన 'కాంజూరు' 'టాంజూరు' వ్రాత ప్రతుల్ని సేకరించటంలో చేసిన కృషి అనన్యసామాన్యమైనదని, మార్గదర్శకమైన దని పై విషయం వెల్లడిస్తోంది. ఈ వ్రాతప్రతుల్నిగురించి ఇంక ఏ భాషలోను ఏ సమాచారము లభించదు. లాసా నించి అరుదైన గ్రంథప్రతిని రాహుల్ తీసుకుని రాగలిగారు. టిబెటన్ భాషలో మతం, తత్వశాస్త్రం, చరిత్ర, జీవిత చరిత్రలు, కళలు, ఖగోళశాస్త్రం, ఆరోగ్యశాస్త్రం, భూగోళశాస్త్రం వంటి అధ్యయ నాలని గురించి ఉన్న గ్రంథాలని అయన తీసుకుని వచ్చారు. తత్వశాస్త్రానికి సంబంధించిన గ్రంథాలు చాలావరకు నాగార్జునాచార్యుని బౌద్ధమతంలోని 'మాధ్యమిక' శాఖకి' అసంగాచార్యుని 'యోగాచార' శాఖకి సంబంధించినవి.

వీరిద్దరు బౌద్ధమతానికి చెందిన ప్రసిద్ధ తార్కికులు. టిబెటన్ భాషలోని తాంత్రిక గ్రంథాలు 7 వ శతాబ్దంనించి 10 వ శతాబ్దం వరకు రచించబడ్డాయి. 'క్రియ తంత్ర' 'చర్యతంత్ర', 'యోగతంత్రా'లని గురించి పద్మసంభవ, బుసిటాన్, తారానాథ్ రచించిన గ్రంథాలని రాహుల్ తమతో తీసుకుని వచ్చారు; ఆయన కొన్ని సాహిత్యగ్రంథాలని కూడ తీసుకొనివచ్చారు. దండి రచించిన 'కావ్యాదర్శ'పై టిబెటన్‌ల భాషలో ల్న-పా వ్రాసిన వ్యాఖ్యానం, 'కల్ప లత'కి టిబెటన్ బాషలో చేయబడిన రెండు అనువాదాలు, పాణిని రచించిన 'ధాతు-పద'కి దుర్గాసింగు చేసిన అర్థవివరణ మొదలైన గ్రంథాలు. వాటిలో ఒక చారిత్రక గ్రంథం మగధని మహమ్మదీయులు జయించి ఓదాంతపూర్‌ని, విక్రమ శిల విశ్వవిద్యాలయాన్ని వారు ధ్వంసం చేయటానికి సంబంధించినది. ప్రాచీన భారతీయ విద్యావిధానంపై తాము వ్రాసిన వ్యాసంలో డా. ఎస్. ఆల్టేకర్ వీటి వివరాలని పొందుపరిచారు. బౌద్ధమతంలోని మహాయాన, వజ్రయాన శాఖలకి చెందిన వస్త్రాలపై రచించబడిన 130 చిత్రాలని కూడ ఆయన తీసుకుని వచ్చారు. 1934, 38 మధ్యకాలంలో ఆయన టిబెట్‌ని మూడు పర్యాయాలు సందర్శించారు. అక్కడవున్న ఆరామాలనించి అరుదైన విలువై గ్రంథాలని ఎన్నో ఆయన సేక రించారు. టిబెటన్ భాషకి మొదటి వ్యాకరణాన్ని, నాగరిభాషకి మూడు ప్రాథ మిక పాఠ్యగ్రంథాలని ఆయన రచించారు. ధర్మకీర్తి రచించిన 'ప్రమాణవార్తిక' వ్యాఖ్యానాన్ని టిబెటన్ భాషనించి సంస్కృతంలోకి పునఃసృజనచేసి తమతో తీసుకుని వచ్చారు. టిబెటన్-హిందీ నిఘంటువుని ఆయన సమకూర్చారు. ఆ నిఘంటువుని ఆయన మరణానంతర సాహిత్య అకాడమి వారు ప్రచురించారు.

ఆయన జీవితగాథని మళ్ళీ కొనసాగిద్దాం ఆయన జీవితంలోని ముఖ్య మైన వ్యాపకం టిబెట్ దేశయాత్రలు మాత్రమే కాదు. 1930 లో ఆయన శ్రీలంక వెళ్ళారు. 1931 లో సత్యాగ్రహోద్యమంలో పాల్గొన్నారు. 1931-32 సంవత్స రాలలో ఆయన మూడోసారి శ్రీలంక వెళ్ళారు. 1932-33 సంవత్సరాల మధ్య కాలంలో ఐరోపాఖండంలోని ఇంగ్లాండు, ఫ్రాన్స్, జర్మనీదేశాలు సందర్శించి ప్రముఖప్రాచ్య విజ్ఞాననిధులైన విద్వాంసుల్ని కలుసుకున్నారు. 1935 లో చాలా నెలలు జపాను, కొరియా, మంచూరియాలలో పర్యటించారు 1935వ సంవత్సరం ఆగస్టు 29 వ తేదీన ఆయన ఎక్కినరైలు మాస్కో చేరుకోటానికి ఏడురోజులు పట్టింది. 1935 వ సంవత్సరం సెప్టెంబరు 4 వ తేదీనించి సెప్టెంబరు 21 వ తేదీ వరకు పదిహేను రోజులు ఆయన రష్యాలో గడిపారు. ఎకడమీషియన్స్ ఓల్డెన్

కిర్గుని, షెర్ బాట్స్కోని కలుసుకోవాలని ఆయన ఎంతో ఉబలాటపడ్డారు. కాని వీరిలో మొదటివారి అప్పటికే కీర్తిశేషులు. రెండవవారు లేనిన్‌గ్రాడ్‌లో ఉన్నారు. లెనిన్‌గ్రాడ్‌ని దర్శించటానికి రాహుల్‌కి అనుమతి లభించలేదు. రైలులో ఆయన మాస్కోనించి బాకువెళ్ళారు. అక్కడ ఆయన అగ్నిదేవాలయాన్ని సందర్శించారు. ఆ ఆలయాన్ని రాహుల్ 'జ్వాలామయి', అని అభివర్ణించారు. నాగరి భాషలో రచించబడిన ఒక శిలా శాసనాన్ని ఆయన అక్కడ చదవగలిగారు. ఈ ప్రదేశాన్నించి ఆయన ఓడలో ఇరాన్ చేరుకుని, టెహరాన్, షిరాజ్, మాషెర్‌వంటి పట్టణాలని దర్శించారు. బెలూచిస్తాను ద్వారా, రైలులో ఆయన లాహోరు చేరుకున్నారు. కలకత్తా విశ్వవిద్యాలయం కోసం డా. ప్రమోదచంద్ర బాగ్చి రాహుల్ దగ్గరనించి 'కాంజూరు' ప్రతిని కొన్నారు.

తమ 'ఆత్మకథ'లో తమకి 47 వ ఏట టైఫాయిడువలన కలిగిన మొదటి తీవ్రమైన అనారోగ్యాన్ని ప్రస్తావించారు. పాట్నాలో ఒక ఆసుపత్రిలో అయిదారు రోజులపాటు ఆయన స్పృహలేకుండా ఉన్నారు. కాని మళ్ళీ 1936 లో ఇరాన్, 1937-38 మధ్యకాలంలో సోవియట్ రష్యా దర్శించారు. ఈసారి ఆయన రష్యాకి సోవియట్ అకాడమి ఆహ్వానాన్ని పురస్కరించుకుని వెళ్ళారు. మాస్కోనించి ఆయన లెనిన్‌గ్రాడ్‌వెళ్ళి అక్కడ 1937 నవంబరు 17 నించి 1938 జనవరి 13 వరకు ఉన్నారు. అక్కడ ఆయన ఇండో - టిబెటన్ శాఖ కార్యదర్శిని అయిన లోలా (ఎలెనా నార్వెర్టోవా కొజెరోవ్స్కాయా) ని కలుసుకున్నారు. ఆమె టిబెటన్ సంస్కృత నిఘంటువుని తయారుచేసే కృషిలో నిమగ్నులై ఉన్నారు. ఆమె ఫ్రెంచి, ఇంగ్లీషు, రష్యన్, మంగోలియన్ భాషల్ని అనర్గళంగా మాట్లాడగలరు. రాహుల్ ఆమెకి సంస్కృతం బోధించటం మొదలుపెటారు. ఆమె ఆయనకి రష్యన్ బోధించారు, వారి స్నేహం సాన్నిహిత్యంగా, చివరికి వివాహంగా పరిణతి చెందింది. తాము మొదట్లో తమ ప్రేమ లేఖల్ని సంస్కృతంలో వ్రాసుకున్నామని ఆమె నాకు చెప్పారు. 1938 సెప్టెంబరు 5 న వారికి ఒక కొడుకు పుట్టాడు. అతడికి ఇగోర్ అని పేరు పెట్టుకున్నారు. మొదట్లో రాహుల్ అతడికి రష్యన్ భాషలో 'అగ్ని'కి సమానార్థకమైన 'డీగాన్' అని పేరు పెడదామనుకున్నారు. కాని 1945 జూలై మళ్ళీ రష్యా వెళ్ళేవరకు ఆయన అతడిని చూడలేకపోయారు. ఈసారి ఆయన పర్యటన 1947 అగష్టు 15 న ముగియవలసి వచ్చింది. ఆ సంవత్సరం తరువాత ఆయన మళ్ళీ ఎప్పుడూ తమ భార్యని, కొడుకుని చూడలేకపోయారు. లోలా మళ్ళీ పెళ్ళి విషయం ఆలోచించలేదు. తమ జ్ఞాపకశక్తి నశిం

చిన తరువాత రాహుల్ రష్యాకు తీసుకువెళ్ళబడి నప్పుడు, లోలా ఆయన్ని కలుసు కోవటానికి వచ్చారు. ఆ మహాపండితుని నయనాలనించి అశ్రువులు ధారాపాతంగా వెలువడ్డాయి. కాని గొంతు మూగబోయింది. ఒక మాటైనా వెలువడలేని దయనీయ పరిస్థితి. నేను 1972 లో లెనిన్‌గ్రాడ్‌లో ఆమెని కలుసుకోవటం తటస్థించింది. రాహుల్, షెర్‌బాట్స్కీ, ఇగోర్‌లు ఉన్న ఛాయాచిత్రాలు ఉన్న ఆల్బమ్‌ని ఆమె నాకు చూపించారు. లోలాకి కాని, ఇగోర్‌కి కాని హిందీ భాషరాదు. రాహుల్ రచించిన పుస్తకాలుకూడా ఏవీ వారి దగ్గరలేవు. వారిద్దరు ఎప్పుడూ భారతదేశం సందర్శించటం జరగలేదు.

రాహుల్ రాజకీయ కార్యక్రమాలలో నిమగ్నులు కాసాగారు. 1939 లో బీహారులోని రైతు పోరాటంలో ఆయన పూర్తిగా పాల్గొన్నారు. ఈ సందర్భంలో ఆయన అరెస్టు చేయబడ్డారు. జైలులోని పరిస్థితులకి నిరసనగా ఒకసారి పదిరోజులు, రెండోసారి పదిహేడు రోజులు నిరాహార దీక్షవహించారు. కొన్ని నెలలు ఆయన్ని విడచి పెట్టారు, 1940 ఫిబ్రవరి 24, 25 తేదీలలో మోతిహారిలో జరిగిన కిసాన్ సమ్మేళనంలో అధ్యక్షస్థానం అలంకరించారు. ఆయన మళ్ళీ అరెస్టు చేయబడ్డారు. 1940 - 42 సంవత్సరాల మధ్య హజారిబాగు, డియోలి కారాగారాలలో 29 నెలల పాటు నిర్బంధంలో ఉన్నారు. ఈ సమయాన్ని రాహుల్ 847 పేజీల 'దర్శన్ - దిగ్దర్శన్' అనే బృహద్గ్రంథాన్ని రచించటానికి వినియోగించుకున్నారు. ఈ గ్రంథంలో ఆయన గ్రీకు, ఇస్లామ్, ఐరోపా, భారతీయ తత్వశాస్త్రాలకి మార్క్సిస్టు అవగాహనతో హిందీభాషలో మొదటిసారిగా విమర్శనాత్మక వివరణచేశారు. విశాలమైన పరిధిలో మూడువేల సంవత్సరాల ప్రపంచ తాత్విక చింతనని హేతు పూర్వకమైన మానవతా దృక్పథంతో చేసిన సింహావలోకనమే ఈ గ్రంథం.

భారతీయ, విదేశీయ తత్వవేత్తల తులనాత్మక పట్టికలో ఆయన సమకాలీను లైన భారతీయ తత్వవేత్తలని ఇద్దరిని మాత్రమే పేర్కొనటం జరిగింది,

హెగెల్ (1770 - 1831) రాజారామమోహన్‌రాయ్ (1774 - 1829)

మార్క్స్ (1818 - 83) దయానంద్ (1824 - 83)

విదేశీయులలో ఈ క్రింది ప్రముఖుల్ని పేర్కొని వారి కృషిని వివరించారు-డెకార్టె, స్పినోజా, లాక్, బార్క్లె, వోల్టేర్, హ్యూమ్, రూసో, కాంట్, ఫిష్టె, షెలింగ్, షొపెన్‌హేయర్, ఫ్యూర్‌బాహ్, స్పెన్సర్, ఎంజెల్స్, మాహ్, విలియమ్ జెమ్స్, నీట్సె, బ్రాడ్లీ, బెర్గ్‌సన్, వైట్ హెడ్, లెనిన్; బెర్ట్రండ్ రసెల్. ఈ గ్రంథ

రచనకై జైలులోనే ఆయన సంప్రదించిన ఉపయుక్త గ్రంథ పట్టికలో సంస్కృతం, పాళి, అరెబ్బి, పర్షియన్ భాషలలోని వందలాది గ్రంథాలతోపాటు, రాహుల్ ఆధునిక భారతీయ తత్వశాస్త్ర చరిత్రకారులలో ఎస్. ఎన్. సెన్‌గుప్త, ఎస్. రాధాకృష్ణన్, ఎస్. సి. విద్యాభూషణ్ వంటి ముగ్గురి ఆంగ్ల రచనలు మాత్రమే పేర్కొన్నారు. మార్క్స్, ఎంజెల్స్, ఫ్యూయర్‌బాహ్, షెర్‌బాట్స్కి రచించిన అయిదు గ్రంథాలుకూడ ఈ పట్టికలో ఉన్నాయి.

ఆయన జైలునించి విడిచి పెట్టబడిన తరువాత, తమ స్వంత ఊరు ముప్పైనాలుగు సంవత్సరాల తరవాత తిరిగి వెళ్లడం హృద్యంగా వర్ణించారు. ఆ గ్రామంలో ఎన్నో మార్పులు జరిగాయి, అయినా, ఏమి మారనట్లే ఉంది, చిన్ననాటి స్నేహితులు ఆయన్ని నాదరంగా ఆహ్వానించారు. ఆయన మొదటి భార్య ఆయిన్ని చూడటానికి వచ్చింది. కాని ఆమెతో తమ వివాహం జరగకముందే ఆయన ఆమెని విడచిపెట్టారు 1942 - 44 సంవత్సరాలలో ఆయన కొంతకాలం రాజకీయ కార్యక్రమాలకోసము, సాహిత్య సమావేశాలకోసమూ భారతదేశంలో నలుమూలలా పర్యటించారు. ఆయన తమ పర్యటల్ని వివరంగా తమ డెయిరీలో వ్రాసుకునే సందర్భాల్లో కొన్ని ఆసక్తికరమైన విషయాలు కనిపిస్తాయి, 18 రకాల నేపాలీ దెయ్యాలని, భూతాలని, 11 రకాల టిబెట్ దేశపు దెయ్యాలని, భూతాలని. వాటి ప్రత్యేక భాష, ఆచార వ్యవహారాలు, విశ్వాసాలు మొదలైన వివరాలతోసహా ఆయన వర్ణించారు. సాంస్కృతిక మానవతాధ్యయన శాస్త్రానికి, సామాజిక శాస్త్రానికి, ఆర్థిక పరిస్థితుల అవగాహనికి, భాషాశాస్త్రానికి, ప్రయాణాలకి సంబంధించిన కష్టనిష్టూరాల వివరాలకి భౌగోళిక, భూగర్భశాస్త్రాలకి, రాజకీయపు ఒత్తిళ్ల సమాచారానికి, పురాతత్వశాస్త్రానికి, మత చరిత్రలకి, మరుగుపడిన మతాచారాలకి, విశ్వాసాల సరణికి ఆయన రచనలు విలువైన భాండాగారం వంటివి; వీటన్నిటికి అవి కలగూరగంప వంటివి. ఈ సమాచారాల నన్నింటిని ఆయన ఎంతో ఆసక్తికరంగా ధారాళమైన శైలితో పాఠకులకి అందజేయగలిగేవారు. అనవసరమైన వివరాలతో ఆయన ఎప్పుడూ పాఠకుల మనసుకి అలసట కలిగించి విసుగు తెప్పించేవారు కారు.

1948 తరువాత, చైనాలో ఒక పర్యాయం పర్యటించటం, సింహళంలో ఆచార్యపదవిని అలంకరించటం మినహాయిస్తే, రాహుల్ తమ కాలాన్ని అంతా భారతదేశంలోనే గడిపారు. ఈ పర్యటనల తరువాత ఆయన అస్వస్థులు అయ్యారు. సోవియట్ రష్యాలో వారి ఆఖరి పర్యటన ఆయన జ్ఞాపకశక్తిని

కోలుపోయిన తరువాత జరిగింది. నేను ఈయనతో సన్నిహిత సంబంధాన్ని 1944 లో ఏర్పరుచుకున్నాను. 1948 లో ఒక నిఘంటు సంకలనంలో నేను ఆయనకి సహాయం చేయగలిగాను. మాతో రాహుల్ 1944 లో ఉజ్జయినిలోను, 1950 లో అలహాబాదులోను కలిసిఉన్నారు. నేను, నా కుటుంబసభ్యులము మూడు వేసవి సెలవుదినాలలో ఆయనకి అతిథులుగా నైనిటాల్‌లో డార్జిలింగులో, కాలింపాంగు, కుమాడాం, మసూరిలలో ఉన్నాము. నాకు ఆయన అతి సన్ని హితులైన కుటుంబస్నేహితులు అయ్యారు.

ఆయన తీవ్రమైన మధుమేహ (డయాబిటీస్) వ్యాధితో బాధపడుతూ ఉండే వారు. అధికశ్రమ, వ్యక్తిగతమైన మనోవేదనలు ఆయన్ని రోగగ్రస్తుణ్ని చేశాయి. ఆయన తన జీవితంలోని చివరి రెండుసంవత్సరాలలో తమ జ్ఞాపకశక్తిని పూర్తిగా కోల్పోయారు. మహామేధావి, పండితుడు అయిన అటువంటి వ్యక్తి, తమ అవ సానకాలంలో తమ పేరుతామే చదువుకోలేని స్థితిలోను, నాలుగు మాటలైన అర్థవంతమైన క్రమంలో మాట్లాడలేని స్థితిలోను, ఉండటం అతి విషాదకరమైన విషయం. ఆయన జీవితంలోని వ్యక్తిగతమైన హఠాత్సంఘటనలకి, ఆయన జ్ఞాపకశక్తి నాశనానికి ఖచ్చితమైన కారణాలు ఎప్పటికి తెలియవు. తన ఆఖరి రోజుల్లో 'నిరాలా', తన జీవితంలోని ఉత్తరార్థంలో 34 సంవత్సరాలపాటు కాజా నజరుల్ ఇస్లామ్ కూడ ఇలాంటి అవస్థలోనే తమకాలం వెళ్ళబుచ్చారు. మహా విద్వాంసులు, సృజనాత్మక రచయిత అయిన రాహుల్ విశ్రాంతిఎరగని ప్రవృత్తి చివరకి అత్యంత విషాదకరంగా అంతమయింది. బహుశః ఆయనకి తగిన గుర్తింపు, అవసరమైన విశ్రాంతి ఆయనకి తమ జీవితకాలంలో లభించలేదు. చాలా ఆలస్యంగా ఆయన వివాహం చేసుకున్నారు. పసివాళ్ళైన తమ పిల్లల్ని గురించి బెంగ ఆయన్ని వేధించసాగింది. పాక్షికంగా ఆయన మూగవారైనప్పుడు, 'ఇద్దరు పిల్లలు - ముగ్గురు పిల్లలు' అని ఏదో ఎప్పుడూ గొణుక్కుంటూ ఉండే వారు. బహుశః, ఆయన మనసు ఆయన శరీరానికి తగినట్టు లేకపోయి ఉండ వచ్చు. మందులసహాయంతో ఎప్పటిలాగే తమ కార్యక్రమాలలో ఉత్సాహంగా ఉండవచ్చునని అపోహలో ఆయన ఉన్నారు. ఆయన జీవితంలోని ఆఖరి దశని గురించి ఆయన ఆఖరిభార్య కమలసాంకృత్యాయన్ ఒక్కరే నిక్కచ్చిఅయిన నిజాలనివ్రాయగలరు. కాని వ్రాయవలసినదంతా వ్రాయబడిన తరువాత, ఊహించవలసిన విషయాలు ఊహించబడిన తరువాత నిజం ఇంకా అలభ్యం

గానే మిగిలిపోవచ్చు. బైబిలులోని జెస్టింగుపైలెట్ మాదిరిగా, మృత్యువు జవాబు కోసం ఎదురుచూడలేదు.

వ్యక్తిగా ఆయన మంచి దయాశీలి. తమ ప్రవర్తనలో అయన అనురాగ మూర్తి మంచి నిగ్రహంతోను క్రమశిక్షణతోను ఆయన తమ కార్యక్రమాలని నిర్వర్తించుకునేవారు. రోజుకి 18 గంటలు కూడ పని చేయగలిగేవారు. వ్యక్తి గతమైన కోరికలు. వినోదకాలక్షేపాలు ఆయనకి చాల తక్కువ. ఆహార, వేష ధారణ విషయాలలో అయన అతి నిరాడంబరంగా ఉండేవారు. స్నేహితులకి, యువక పరిశోధకులకి ఆయన ఎంతో సహకారాన్ని అందించేవారు. నిర్మొహ మాటంగా, నిర్భయంగా ఎంత గొప్పవారినైనా, ఎంత పలుకుబడి కలవారినైనా విమర్శించటానికి, గాయపరచటానికి ఆయన వెనుకాడేవారుకారు. తన గాఢ విశ్వాసాలని ఆయన నిష్కర్షగా వెల్లడించేవారు. తనకు తెలిసిన సత్యాన్ని నీళ్ళు నమలకుండా తెలియచేసేవారు.

అయన తమ విశ్రాంతిసమయాన్ని అంతా వ్రాసుకోటానికి, చదువుకోటా నికి వినియోగించారు. తమ రచనల్లో ఆయన ఎంతో తీవ్రతని, ఆగ్రహాన్ని వెల్లడించినా, వ్యక్తిగా ఆయన మృదుభాషి, మితభాషి; వేదికలమీద ఉపన్యాసాలు చేసే వ్యక్తికాదు. 34 పైగా భాషల్లో మంచి పాండిత్యం ఉన్నప్పటికి, తమ రచనావ్యాసంగాన్ని ఉపన్యాసాలని ఎక్కువభాగం సంస్కృతంలోను, హిందీలోను సాగించారు. తమ ఉపన్యాసాలలోను రచనలలోను ఆయన అతిసరళమైన సులభ గ్రాహ్యమైన భాషని ఉపయోగించేవారు. సామాన్య పాఠకుణ్ని ఎల్లప్పుడు ఆయన తమ దృష్టిలో పెట్టుకునేవారు. ఒక్కొక్కసారి వారిరచనల్లో మత ప్రచారకులకి మతాభిమానులకి చెందిన ఏకపక్షవాదం ద్యోతకం అవుతుంది. కాని హేతు బద్ధంకాని విశ్వాసాలకి ఆయన అంకితమయినవారు కారు. సామాన్య పరిస్థితుల్నించి పైకివచ్చి, స్వయంకృషితో విద్యార్జనచేసిన రాహుల్ సాధించిన, పెంపొందించు కున్న ప్రగతిశీల, హేతుపూర్వక, మతాతీత మానవతా దృక్పథం ప్రత్యేకంగా పేర్కొనదగినది. కొన్నిచోట్ల ఛాందసుల్నిగురించి, ఆధ్యాత్మిక పరుల్నిగురించిదొంగ సన్యాసుల్ని గురించి ఆయన చేసిన విమర్శలని మినహాయిస్తే, ఆయన సాధా రణంగా ఘాటైన రచనలు చేయలేదు. ఎప్పుడు, తమ ప్రత్యర్థులవాదాల్ని అవ గాహన చేసుకోవటానికి, ప్రతివిషయంలోను ఏదో మంచిని చూడటానికి, పైకి రుచికరంగా కనిపించని విషయాలని అసాధారణమైన ప్రక్రియలని అర్థం చేసు కోటానికి ప్రయత్నించేవారు, బుద్ధభగవానుని 'కరుణ' సిద్ధాంతాలిని అధ్యయనం

చేసిన తరువాత, తమలో అంతర్వాహినిగా ఉన్న సానుభూతిచే పరిపూర్ణులైన రాహుల్ జీవించిన జీవితం, సమర్పించిన సాహిత్యసంపద పాఠకుని మనసుపై చెరగని ముద్రవేస్తుంది. అనడంలో సందేహంలేదు. మనచుట్టూఉన్న ప్రపంచం లోని సంక్లిష్టమైన వాస్తవాల్ని రాహుల్ అర్థం చేసుకున్నారు. ఈ అన్వేషణలో ఆయన ఒక వినూత్నమైన సమదృష్టిని, ఆత్మకీ నూతన మానవునికి సంబంధిం చిన భావాల సమన్వయాన్ని సాధించగలిగారు.

రాహుల్ ఊహాజీవికారు. ఆవేశాలకి బద్ధులుకూడా కారు మిగతా మనుషులతో-వారు ఆయనకంటె ఉన్నతోద్యోగాలలో ఉన్నవారైనా, అనుభవజ్ఞులైనా సమానమైన హోదాలో ఉన్నవారైనా చిన్నవారైనా – ఎప్పుడు మంచి స్నేహితుడిగా వ్యవహరించేవారు. ఎప్పుడూ అన్వేషణలోఉన్న వ్యక్తిగా కనిపించేవారు, ఆయన నిరాశావాది కారు; తీవ్రమైన విమర్శకుడుకారు. 'తుమ్‌హారీక్షయా' అనే గ్రంథంలో కొన్ని వ్యవస్థలని, మానవులు ప్రతిష్ఠించిన విగ్రహాల్ని నిరసిస్తూ వాదించటం జరిగింది. 'ధున్‌మున్' అనే భోజపురి భాషలో రచించబడిన నాటకంలో రాజకీయపు హేమ్లెట్‌లని అధిక్షేపిస్తూ, మృదువైన హాస్యధోరణిలో పురుషుడిపై స్త్రీ శక్తికిఉన్న అధికారాన్ని విమర్శించారు. కపట సన్యాసులు చెప్పే శ్రీరంగనీతులు, ఆచరించే దురాచారాలలోని వైరుధ్యాలని బైటపెడుతూ, ఆయన రచనలు చేశారు. ఆయన రచనలన్నింటిలోనూ, ఆత్మజ్ఞానంతో దేదీప్యంగా వెలిగిపోతూన్న దయార్ద్రమైన హృదయం దృశ్యాదృశ్యంగా కనిపిస్తూనే ఉంటుంది.

# 2. రచనలు

రాహుల్‌చేసిన రచనలని స్థూలంగా వివరించే పట్టికకూడా ఈ పుస్తకం విస్తృతిని మించి ఉంటుంది. ప్రస్తుతం మన దృష్టిని ఆయనచేసిన సాహిత్యానికి సంబంధించిన విమర్శనాత్మక, సృజనాత్మక రచనలకె పరిమితం చేయటం అవసరం, సాహిత్యం విశాలమైన అర్థంలో మానవశాస్త్రానికి సంబంధించిన తత్త్వశాస్త్రం, చరిత్ర, సామాజిక శాస్త్రం మొదలైన శాఖలన్నిటికి సంబంధించినది. కాబట్టి, ఆయన ఈ శాఖలలో చేసిన రచనలని గురించికూడ ముచ్చటించటం జరుగుతుంది. 1927 లో తమ 34వ ఏట నిరంతరాయమైన రచనా వ్యాసంగాన్ని

రాహుల్ మొదలు పెట్టారు. 1961 లో రోగగ్రస్తులు అయ్యేంతవరకు సాగించారు, 'ఆయన తమ రచనా వ్యాసంగాన్ని మంచి క్రమపద్ధతిలో గడియారంలా నిర్వహించారు' అని ప్రకాశచంద్రగుప్త తెలియజేశారు. 34 సంవత్సలలో ఆయన 50 వేల పేజీల ప్రచురణ చేశారు. ఇంకా 12 గ్రంథాలు అముద్రితాలుగానే ఉండి పోయాయి. ఇది ప్రశంసనీయమైన కృషి, అందులో, ఆయన ఎన్నో సంవత్సరాలు ప్రమాదభరితాలైన ప్రయాణాలుచేస్తూ, విదేశ సంచారాలుచేస్తూ గడపటమేకాక, కొన్ని సంవత్సరాలు కారాగారాలలో కూడ గడపవలసివచ్చింది. అటువంటి వ్యక్తి చేసిన రచనల విస్తృతికూడ మనకి ఆశ్చర్యం కలిగిస్తుంది. ఆయన అత్యంత వేగంతో, అలసట ఎరగకుండా రచనలు చేసేవారు. రచనలు చేయటానికి ఒక ప్రత్యేక మానసిక స్థితికోసం, సౌఖ్యమయమైన పరిస్థితులకోసం కాచుకుని కూర్చునే వారుకారు. రైళ్ల ప్రయాణాలలోను, ఓడ ప్రయాణాలలోను, హోటళ్ళలోను, సత్రాలలోను, చిన్న కేంపులకి వెళ్లినప్పుడు, ఇంటి దగ్గర, మార్గ మధ్యంలోను - అన్ని చోట్లా ఆయన తమ రచనా కార్యక్రమాన్ని కొనసాగిస్తూనే ఉండెవారు.

# 3. నవలా రచన

నవలలుగా పరిగణించదగిన 13 గ్రంథాలని రాహుల్ రచించారు. వీటిలో చారిత్రక నవలలైన 'సింహ సేనాపతి', 'జయయోధేయ' (వీటిని నేను విశాల భారత్'లో 1938 లో సమీక్షించటం జరిగింది), 'విస్మృత యాత్రి' 'దేవోదాస్', 'మధుర స్వప్న' అన్నవి ప్రత్యేకంగా పేర్కొన తగినవి. వీటిలో మొదటి మూడు నవలలు భారతదేశపు ప్రాచీన, మధ్యకాల చరిత్రకి సంబంధించినవి. 'దేవోదాసు' వేదకాలపు ఆర్యుల జీవన విధానంపై ఆధారపడి రచించబడ్డ కల్పిత గాథ. ఆఖరి నవల పర్షియా దేశ చరిత్రకి సంబంధించినది. రాహుల్ రెండు సాంఘిక నవలలు మాత్రమే రచించారు. వీటిలో 'జీనే కెలియే, (బతకటం కోసం) ఒకటి ఇందులో 1914 వ సంవత్సరంలో ప్రపంచ మహాయుద్ధంలో పాల్గొని, తరువాత భూస్వామ్యాన్ని, ఫ్యూడల్ పద్ధతిని, సామ్రాజ్యవాదాన్ని ఎదిరిస్తూ జరిగిన విప్లవోద్యమంలో చేరిన ఒక పేదరైతు గాథ ఇతివృత్తంగా స్వీకరించబడింది. 'రాజస్థాని రాణివాస్' అనేది ఆయన రచించిన రెండవ సాంఘిక నవల ఇందులో రాజస్థాన్

లోని అంతఃపురాలలో రాణివాసాలలో బానిసలుగా పనిచేసే స్త్రీల హృదయ విదారకమైన గాథలు వర్ణించబడ్డాయి. ఆయన రచించిన ఇంకో రెండు కల్పిత గాథలు కూడ చాలవరకు సాంఘికాలే. 'బైసలి పది' (ఇరవై రెండో శతాబ్దం) అనే ఊహా ప్రపంచ చిత్రణ, వ్యావహారిక భాషలో సంభాషణా ధోరణిలో సాగిన 'భాగో నహీ! దునియాకోబదలో' ('పారిపోవద్దు, ప్రపంచాన్ని మార్చండి!') అనే నవలలు ఈ కోవకి చెందినవి.

ఆయన ప్రచురించిన నాలుగు కథానికల సంపుటాలలోను 'సాత్మి కెబచ్చె' అనే సంపుటి పేదరికానికి, సాంఘిక అసమానతలకి బలిఅవుతున్న పిల్లల దయనీయమైన పరిస్థితుల్ని హృదయంగమంగా చిత్రిస్తుంది. యథార్థమైన పల్లె జీవితాల నించి ఆయన సేకరించిన చేదునిజాలకు ఆయన చేసిన రూపకల్పనలే ఇవి. వీటిలో గోర్కి ప్రదర్శించిన సామాజిక వాస్తవికత మనకి స్పష్టంగా గోచరిస్తుంది. ఒకసారి గోర్కిలెనిన్‌కి లేఖవ్రాస్తూ, 'మంచి పుస్తకంకంటె చెడ్డమనిషి ఉత్తముడు' అని అన్నారు. ఈ సంపుటిలో చారిత్రక ఇతివృత్తానికి సంబంధించిన 'స్మృతి జ్ఞానకీర్తి' అనే కథకూడా ఉంది.

ఇంకో రెండు కథాసంపుటాలు రెండు ప్రదేశాలలోని సాంఘిక, చారిత్రక పరిస్థితుల్ని చిత్రిస్తాయి. 'బహురంగి మధుపురి' అనే సంపుటిలో మసూరిలోని అందాలని చిత్రించే ఇరవైఒక్క రేఖాచిత్రగాథలు కనిపిస్తాయి. ఇందులోనించి ఎన్నికచేయబడ్డ తొమ్మిది కథలు 'రూపి' అనే సంకలనంగా కూడా వెలువడ్డాయి. రెండవ సంపుటి 'కనైలాకి కథా', దీన్ని గాథ అని వ్యవహరించినా, అది సరి కాదు. క్రీ. పూ. 1300 వ సంవత్సరం నించి క్రీ. శ. 1957 వరకు జరిగిన జీవిత పరిణామాలని చిత్రించే తొమ్మిది కథలు ఇందులో మనకి కనిపిస్తాయి. బెంగాలిభాషలో ఈ గ్రంథ అనువాదానికి 'వోల్గానించి గంగకి - రెండోభాగం' అని పేరు పెట్టబడింది.

రాహుల్‌కి నాలుగుకాలాలు నిలిచేపేరు తెచ్చిపెట్టిన ముఖ్యమైన కథా సంపుటి 'వోల్గాసెగంగా' (వోల్గానించి గంగకి), ఇందులో వేదపూర్వకాలం నించి 1944 వ సంవత్సరం నాటి నవభారతం వరకు సంబంధించిన ఇరవై కథలు ఉన్నాయి వీటిలో 14 కథలు ప్రాచీన మధ్యకాల భారతదేశచరిత్రకి సంబంధించినవి. పదిహేనో కథతో మహమ్మదీయ, బ్రిటిషు పరిపాలనకు సంబంధించిన చారిత్రక గాథ ప్రారంభం అవుతుంది. చరిత్రకి సంబంధించిన ఒక కాలాన్ని

ఎన్నుకుని, ఒక కల్పితసంఘటనని గతితార్కిక భౌతికదృష్టితో పునర్నిర్మించ టానికి, విశ్లేషించిటానికి రాహుల్ ప్రయత్నించేశారు. కాళిదాసుని ఫ్యూడల్ వ్యవస్థకు చెందినకవి అని నిందాపూర్వకంగా వర్ణించటంలోను, హిందు, ముస్లిముల సఖ్యత అసహజమైనది అని వివరించటంలోను ఆయనలో ఒక్కొక్క సారి వ్యక్తిగత దురభిమానం నిష్పాక్షిక దృష్టికంటె బలీయంగా కనిపిస్తుంది. అయినప్పటికి, రచనా ప్రణాళికలోను రచనా నిర్వహణలోనూ ఈ బృహద్గ్రంథం హిందీసాహిత్యం భారతీయ సాహిత్యానికి అర్పించిన అమూల్యమైన ఆభరణము అని అంగీకరించాలి. *

# 4. ఆత్మకథ - జీవితగాథలు

ఐదు సంపుటాలుగా వెలువడిన ఆయన ఆత్మకథ, సమగ్రమైన జీవిత చరిత్రలు, జీవితగాథలకిచెందే రేఖాచిత్రాలు సంకలనం చేయబడ్డ పదిహేడు సంపుటాలు రాహుల్ చేసిన సాహిత్యవచన రచనల్లో ప్రముఖస్థానాన్ని అలంక రిస్తాయి.

ఆయన ఆత్మకథ 2814 పేజీలను విస్తరించిఉంది. 'భారతదేశంలోను. విదేశాలలోను, వ్యక్తులు, వ్యక్తులసమూహాలు సృష్టించిన రాజకీయ, సాంఘిక, సాహిత్య, చారిత్రక పరిస్థితుల్ని తెలియజేసే విజ్ఞాన సర్వస్వమే ఆ గ్రంథం' అని కీ. శే. శివచంద్రశర్మ ప్రశంసించారు.

ఇంకో నాలుగు సంపుటాలు కూడ ఆయన జీవిత గాథకి సంబంధించినవే. 'బచ్‌పన్ కే స్మృతియాఁ'లో ఆయన చిన్ననాటి ముచ్చట్లు కనిపిస్తాయి. 'అతీత్ సె వర్తమాన్'లో ఆయన కలుసుకున్న మహావ్యక్తుల్ని, మహామేధావుల్ని గురించిన జ్ఞాపకాలు, వ్యాసాలు ఉన్నాయి. సహాయ నిరాకరణోద్యమానికి సంబంధించిన తమ జ్ఞాపకాలని 'మేరి అసహాయయోగ్ కెసాథీ' అనే గ్రంథంలో వివరించారు. 'జిన్‌కే మెఁ కృతజ్ఞ'లో తమకి బాగా తెలిసిన ఏభై ఒక్కమంది మహామేధావులకి ఆయన అర్పించిన భక్తిపూర్వకమైన నివాళులు కనిపిస్తాయి.

* ఈ గ్రంథం తెలుగులో అనువదింపబడినది—(అనువాదకుడు)

చరిత్రకి సంబంధించిన జీవిత గాథలలో, ఆయన రచించిన బుద్ధుని జీవిత గాథని చిత్రించే 'మహామానవ్ బుద్ధ్', సింహళ ద్వీపానికి చెందిన ఏడుగురు మహా వ్యక్తుల జీవిత గాథల్ని తెలియజేసే 'సింహళ్ కె వీరపురుష్', 'సింహళ్ ఘూము క్కర్ జయవర్ధన్', 'సర్దార్ పృథ్వీసింగ్'. 'ఘూమక్కర్ స్వామి' (హరీశరానంద), 'వీర్ చంద్రసింగ్ ఘర్వాలి', 'కప్తాన్‌లాల్' (జస్వంత్ చంద్ర) ముఖ్యమైనవి. ఆయన రచించిన జీవిత గాథలలో నవభారత నేతలని వర్ణించిన 'నవభారత్ కేనయే నేతా' అనే రెండు సంపుటాల గ్రంథం అమూల్యమైనది. ఈ సంపుటాలలో కాశ్మీర్ సింహం షేక్ అబ్దుల్లా కామ్రేడ్సు యూసఫ్, భరద్వాజ. ఎస్. జి, సర్దే శాయి, స్వామి సహజానంద, ఎస్. ఏ డాంగె,కల్పనాదత్ జోషి, బంకిమ్ ముఖర్జి, పి. సుందరయ్య. కె. కేరళీయన్, ఆర్. బి. మోర్, డా. జి. అధికారి, డా. కె. ఎమ్ అష్రాఫ్, పి. సి. జోషి, ఎస్. ఎస్. బాట్లీవాలా, ముహమ్మద్ షాహిద్, సయ్యద్ జమాలుద్దీన్ బుఖారి, ఫజల్ ఇల్లాహి ఖుర్బాన్, ముబారక్ సాగర్, డా. జడ్. ఏ. అహమ్మద్, మహమ్మద్ జఫార్, 'నిరాలా', పంత్ మొదలైనవారి జీవితగాథలు సంక్షిప్తంగా చిత్రించబడ్డాయి. ఈ రచనలకోసం ఆయన ఆ వ్యక్తుల్ని స్వయంగా కలుసుకుని వారి వంశ చరిత్రలు, చిన్ననాటి విశేషాలు, ఉద్యోగసద్యో గాలు, రాజకీయ సాంఘిక పోరాటాలు, కార్యక్రమాలు క్షుణ్ణంగా తెలుసుకున్నారు. భారతదేశంలోని సోషలిస్టు ఉద్యమ చరిత్రని అధ్యయం చేసేవారికి ఇది విలువైన సమాచారాన్ని అందచేయగలిగిన విలువైన మూలగ్రంథం. కాని దురదృష్టవశాత్తు అచ్చయిన కాపీలు ఖర్చయిపోవటంతో ఇప్పుడు దుర్లభంగా ఉంది.

హిందీభాషలో సమగ్రమైన, విశ్వసనీయమైన జీవిత చరిత్రలు నాలిగింటిని రాహుల్ రచించారు. ఇవి కార్ల్‌మార్క్స్, లెనిన్, స్టాలిన్, మాసేటుంగుల జీవితచరిత్రలు. 351 పేజీలువున్న మావోసేటింగు జీవితచరిత్రకి 1956 లో ఉపోద్ఘాతం వ్రాస్తూ, 'మావో ఆసియాకి చెందిన వ్యక్తి. ఆసియాలో చైనాకిచెందిన వారు, చైనాకి భారతదేశంతో అనాదిగా సాంస్కృతిక సంబంధాలు ఉన్నాయి. ప్రతిదేశంలో ఆ దేశ తత్త్వము, పరిస్థితుల ననుసరించి మార్క్సిజమ్‌ని అమలు పరిచే విధానాలు విభిన్నంగా వుండటం తప్పనిసరి. ఈ కష్టసాధ్యమైన పనిని నెరవేర్చటానికి మార్క్స్, ఎంజెల్స్, లెనిన్, స్టాలిన్, మావో వంటి మేధావుల అవసరం ఎంతైనా ఉంది. ప్రతిదేశంలోను విప్లవాన్ని నూతనసృష్టిని తీసుకు రాగలిగిన శక్తులు ఉంటాయి. విప్లవానికి అనువైన పరిస్థితులు కూడ ఉంద

వచ్చు. కాని విజయవంతమైన విప్లవానికి నాయకత్వం వహించకలిగిన వ్యక్తులు ఉండటం జరగదు. భవిష్యత్తులో విప్లవావశ్యకత ఏర్పడితే, అటువంటి నాయకులు తప్పకుండా ఆవిర్భవిస్తారు. మనదేశానికి మావో జీవితం ఎన్నో పాఠాల్ని నేర్పించ గలదు.' ఈ వాక్యాలవలన రాహుల్ విశాలదృక్పథం కలిగిన మార్క్సిస్టు అని, ఆయన ఎప్పుడు ఎవరినైనా పొగడాలని కాని ఎవరినించైనా లాభం పొందాలని కాని రచనలు చేయలేదని స్పష్టం అవుతోంది. సోషలిజాన్ని ఆయన పుస్తకాల నించి నేర్చుకోలేదు; జీవితాన్నించి నేర్చుకున్నారు. ఆయన పడక కుర్చీలో కూర్చున్న సూత్రకారుడు మాత్రమే కాదు. తాము సందర్శకులని కలుసుకునే గదికి మాత్రమే పరిమితులయిన పండితులు కూడ కాదు

ఆయన చేసిన సృజనాత్మక రచనలలో మరోశాఖ ఆయన విస్తృతంగా చేసిన పర్యటనలను అనుభవాలకి సంబంధించినది. ఈ కోవకు ఆయన రచించిన 13 పుస్తకాలు చెందుతాయి.

1. 'మేరి లడాఖ్ యాత్ర'లో మీరట్‌నించి పంజాబ్, ముల్తాన్, డేరా గజిఖాన్, సరిహద్దు ప్రాంతం, పంచ్ సంస్థానం, కాశ్మీరు, జోజిలా కనుమల ద్వారా లడాఖ్‌కి ఆయన చేసిన ప్రయాణం వర్ణించబడింది. 1939 లో రచించ బడ్డ ఈ గ్రంథంలో లాహౌల్, కులు లోయలుకూడ సుందరంగా వర్ణించబడ్డాయి.

2. 'లంక'లో అనురాధపూర్, పొలనమూరు, కొలంబోవంటి ప్రదేశాల వర్ణనలతోపాటు వాటి చారిత్రక వివరాలు కూడ పొందుపరచ బడ్డాయి.

3. 'మేరీ యూరప్ యాత్ర'; 1935 లో ప్రచురించబడ్డ ఈ రచనలో ఆయన బాధాంత ఆనందకౌసల్యాయన్‌తో కలసి 1932 లో కొలంబోనించి లండన్, పారిస్, జర్మనీలలో కావించిన పర్యటనలు వివరించబడ్డాయి.

4. 'మేరీటిబెట్ యాత్ర'; 1937 లో ప్రచురితమైన ఈ రచనలో లాసా చాంగ్, శాక్య, జ్ఞానమ్, నేపాలులలో ఆయన వ్రాసుకున్న డెయిరీలనించి కొన్ని భాగాలు కనిపిస్తాయి.

5. 'యాత్రా కె పన్నె': 1952 లో ప్రచురించబడిన ఈ గ్రంథంలో టిబెట్‌లో రాహుల్ చేసిన మూడవ పర్యటన, రాజస్థాన్‌లో ఆయనచేసిన పర్య టనల నించి కొన్ని భాగాలు, బాధాంత్ ఆనంద కౌసల్యాయన్‌కి ఆయన వ్రాసిన లేఖలు వున్నాయి.

6. 'జపాన్' ఆయన సింగపూరు, హరంగ్‌కాంగ్, షాంఘై, కొబె, టోక్యో, కోయాసన్‌లలో చేసిన పర్యటనల్ని వివరిస్తుంది.

7. 'ఇరాన్' (రెండు సంపుటాలు): మొదటి సంపుటం ప్రాచీన, పర్షియా దేశాన్ని, రెండవ సంపుటం ఆధునిక పర్షియాదేశాన్ని వర్ణిస్తాయి. సోవియట్ రష్యాలోని బాకునించి తిరిగివస్తూ ఆయన టెహరాన్, ఇస్ఫహాన్, షిరాజ్‌లు దర్శించారు.

8. 'రూస్ మే, పచ్చీస్‌మాస్' (రష్యాలో ఇరవై అయిదు నెలలు): 1952 లో బికనీర్‌లో మొదటిసారి ప్రచురించబడిన ఈ గ్రంథం 'మేరెజీవన్ యాత్ర' మూడవ భాగంగా 1967 లో పునః ప్రచురణ చేయబడింది.

9. 'కిన్నౌర్ దేశ్‌మేఁ'; 1948 లో ప్రయాగనించి మొదట ప్రచురించ బడింది. 1956 లో అలహాబాదులో ద్వితీయ ముద్రణ చేయబడింది. హిమాచల ప్రదేశ్‌లోని కిన్నౌర్‌కి రాహుల్ యాత్ర ఇందులో వర్ణించబడింది.

10. 'టిబ్బట్ మేఁ సవావర్ష్': 1933 లో ఢిల్లీలో ప్రచురించబడిన ఈ రచన 'రాహుల్ యాత్రావళి' మొదటి భాగంలో పునర్ముద్రించబడింది.

11. 'ఘుమక్కర్ శాస్త్ర' (పర్యటనా శాస్త్రం): నిరంతర యాత్రికులిగా, దేశదిమ్మరులుగా తయారుకావాలనుకునే వారికి ఎక్కువ ఉపకరించే ఆసక్తికరమైన మార్గదర్శక లఘు రచన.

12. 'ఆసియాకి దుర్గమ భూఖండోం మేఁ' (ఆసియాలోని దుర్గమ ప్రాంతా లలో) టిబెట్‌లో రాహుల్ చేసిన రెండవ యాత్రా విశేషాలు వివరిస్తుంది,

13. 'చీన్ మేఁ క్యా దేఖా?' (చైనాలో ఏమి చూశాను?): 1958 లో రాహుల్ చైనా సందర్శించిన సందర్భంలో నవచైనా వర్ణనని ఆకర్షణీయంగా చేసిన రచన.

ఈ పుస్తకాలే కాక, హిమాలయ పర్వత శ్రేణులకి సంబంధించిన డార్జి లింగ్, కుమావోఁ, ఘరేవాల్, జౌన్సార్, నేపాలు, హిమాచల ప్రదేశ్‌వంటి వేర్వేరు ప్రాంతాలని గురించి వేరు వేరు సంపుటాలని ఆయన ప్రచురించారు, సోవియట్ మధ్య ఆసియాగురించి, సోవియట్ భూమిని గురించి విపులమైన సమాచారాన్ని ఇస్తూ ఆయన రచించిన గ్రంథాలు ప్రత్యేకంగా పేర్కొ తగినవి.

సాహిత్యపరంగా విలువైన ఇతర రచనలలో ఆయన రచించిన చారిత్రక గ్రంథాలు ప్రముఖమైనవి. మధ్య ఆసియా చరిత్రకి సంబంధించిన 'మ్య

ఆసియా కా ఇతిహాస' అనే గ్రంథం ఇంతకుముందే పేర్కొనడం జరిగింది. ఈ గ్రంథానికి సాహిత్య అకాడమి బహుమతి కూడ లభించింది. ఆయన ఇతర రచనలలో 'ఋగ్ వేదిక ఆర్య', 'అక్బర్', 'ఫౌండర్స్ ఆఫ్ బ్రిటిష్ రూల్ ఇన్ ఇండియా' అనే గ్రంథానికి ఆయన చేసిన హిందీ అనువాదం—మౌలిక రచనలు కాకపోయినా, 'పురాతత్వ నిబంధనావళి' (ప్రాచీన చరిత్ర, పురాతత్వ శాస్త్రంపై వ్యాసాలు)లో కొన్ని అతివిలువైన పరిశోధక వ్యాసాలు కనిపిస్తాయి.

హిందీ సాహిత్యానికి చెందిన ప్రాచీన చరిత్రలోని కొన్ని విషయాలపై ఆయన కొత్తకాంతిని ప్రసరింపచేశారు. సంస్కృతానికి, పాళిభాషకి సంబంధించిన రెండు కవితా సంకలనాలని ఆయన సమకూర్చారు. ఈ సంకలనాల ద్వారా తమ చివరిరోజులలో సాంప్రదాయకమైన, అపౌరాణికాలైన కవితల బృహత్సంకలనాన్ని ఆధునిక పాఠకులు చదివి ఆనందించగలిగే రీతిగ అందించటానికి ప్రయత్నంచేశారు. కాని దురదృష్ట వశాత్తు ఆ గ్రంథం ఇంతవరకు ప్రచురణ భాగ్యానికి నోచుకోలేదు. 'హిందీ కావ్యధార' (అపభ్రంశ) అనే సంకలనాన్ని సమకూర్చి, సంపాదకత్వం నిర్వహించే సందర్భంలో ఇటువంటి కృషి ప్రారంభించారు. ఈ గ్రంథంలో ప్రాచీన హిందీ కవిత్వాన్ని సిద్ధాలకి, నాథాలకి సంబంధించిన సంక్షిప్తమైన, ప్రత్యేకశైలిలో రచించబడిన కవితలతో పోల్చటానికి ప్రయత్నించారు. ఈ సంకలనంలో వేయి సంవత్సరాలకి పూర్వమే కులవ్యవస్థని, ఆచార వ్యవహారాలని నిరసించిన శరహపా(ద్), కన్వాసా(ద్), దోంబిసా వంటి వారి కవితలు చేర్చబడ్డాయి తరువాత కాలంలో విప్లవవాదులు, సంప్రదాయ వ్యతిరేకులు అయిన కబీర్, దాదు, రామదాస్, నామదేవ్ వంటి కవులకి వీరు మార్గ దర్శకులు, ప్రకృతిని గురించి, మానవులలోని అనురాగాన్ని గురించి అబ్దుల్ రహిమాన్, పుషాదంత్ లు చేసిన వర్ణనలలో హాలుడు తన 'గాథా సప్తశతి'లో కొనియాడిన కవిత్వపుఛాయలు మనకి ద్యోతకం అవుతాయి. తులసీదాసు ప్రయోగించిన 'దోహా – చౌపాయ్' అనే కవిత్వ రూపానికి, ఛందానికి మూలమని వ్యవహరించదగిన స్వయంభు రచించిన 'జైమిని రామాయణ్'పై రాహుల్ ఒక వ్యాసాన్నికూడ వ్రాశారు. 'దోహకోశ్'కి వారు వ్రాసిన ఉపోద్ఘాతం ప్రామాణికమైనది, సమగ్రమైనది.

పరిశోధనలకి సంబంధించిన ఆయన రచనలలో దేవనాగరిలిపిలో 'కుతుబ్ ముష్తారి' మొదలైన గ్రంథాలనించి ఆయన సేకరించిన 'దక్కని' కవితల సంకలనం ప్రముఖమైనది. ఇంతకుముందు పేర్కొనబడిన ఉపోద్ఘాతంలాగే, ఈ 'దక్కని కావ్యధార' అనే సంకలనానికి కూడ ఆయన మంచి విద్వత్తుని ప్రదర్శించే ఉపోద్ఘాతాన్ని సమకూర్చారు. 'భాషాపరంగానే కాకుండా, భావనాపరంగా కూడ దక్షిణదేశానికి చెందిన ఈ మహమ్మదీయ కవులు తమ రచనలలో భారతీయ సంప్రదాయాలని చేర్చటమేకాక, సూఫీతత్త్వాన్ని దక్షిణదేశ ప్రాంతాలలోని జానపద వాఙ్మయానికి చెందిన ప్రదానసంప్రదాయాలతో సమన్వయ పరచటానికి ప్రయత్నం చేసారు' అని రాహుల్ తమ ఉపోద్ఘాతంలో ప్రతిపాదించారు. మౌలికమైన సాహిత్య పునరాలోచనకి మార్గదర్శకం కాగలిగిన అతివిలువైన చరిత్రాత్మకమైన ఈ గ్రంథం మొదటిసంపుటం మాత్రమే ఇప్పటికి ప్రచురించబడింది. హిందీసాహిత్య చరిత్రకి రాహుల్ చేసిన అద్వితీయములైన సేవలలో ఇవి కొన్ని మాత్రమే.

సోవియట్ రష్యానించి తిరిగివచ్చాక, హిందీభాషలోకి సద్రుద్దీన్ ఐని రచనలని అనువదించిన తరువాత, హిందీభాష మాట్లాడే వారి ప్రాంతాల్ని, అక్కడిప్రజలు మాట్లాడే హిందీలోని మాండలికాల ప్రాతిపదికమీద, పునర్విభజన చేయాలని రాహుల్ వాదించసాగారు. నిజానికి అవి వేరువేరు భాషా ప్రాంతాలు అనికూడ ఆయన వాదించారు. ప్రాథమిక పాఠశాలస్థాయిలో బోధనా భాషగా భోజపురి, మైథిలి, బ్రజ, అవధి, బుందేల్ఖండి, మాల్వి, రాజస్థానివంటి మాండలిక భాషలని ఉపయోగించాలి అని కూడ ఆయన అభ్యర్థించారు భోజపురిలో ఆయన ఎనిమిది చిన్నినాటికాలని కూడ రచించారు. 'భాగోనహీం, దునియాకోబదలో' (పారిపోవద్దు, ప్రపంచాన్ని మార్చు) వంటి రచనలలో ఆయన బుద్ధిపూర్వకంగా, సులభగ్రాహ్యాలుకాని సంస్కృత, పర్షియన్ భాషలలోని పదజాలాన్ని విడచిపెట్టారు. హిందీభాష శక్తివంతంగా ఉండాలంటే ప్రజలు మాట్లాడే భాషకి దగ్గరగా ఉండాలని ఆయన విశ్వసించటం దీనికి కారణం. ఉత్తమసాహిత్యం కృతకమైన, అసహజమైన హిందుస్తానీభాషలో సృష్టించబడటం అసంభవమని భావిస్తూ, అటువంటిభాషని తయారు చేయటాన్ని కూడ ఆయన వేళాకోళంచేసిన మాట నిజం. (తమ 'ఆత్మ కథ' రెండవభాగంలో 'సుమిత్రానందన్ పంత్ కవిత్వాన్ని తీసుకోండి; ఇక్బాల్ కవితలని తీసుకోండి. వీటిని హిందుస్తానీ భాషలో రచించటం ఎలా సాధ్యం అవుతుంది?' అని ప్రశ్నించారు.) కాని రైతు నాయకు

లైన తరువాత, ప్రజలమధ్య పనిచేసిన వ్యక్తిగా, ఆయన భాష ప్రజలలోకి వెళ్ళాలి అని, నిఘంటువులపై కాక, ప్రయోగంపై ఆధారపడినభాష అభివృద్ధి చెందాలి అన్న విశ్వాసం పెంపొందించుకొనసాగారు. అసహజమై, ప్రయోగం నించి మరుగుపడిపోయిన సంస్కృతీకరించబడిన పదజాలాన్ని సృష్టించిన డా. రఘువీర ప్రయత్నాలని ఆయన తీవ్రంగా విమర్శించారు.

విద్యానివాస్ మిశ్ర, నేనూ కలసి సంకలనం చేయగా, 1948లో ప్రయాగ లోని హిందీసాహిత్య సమ్మేళనంవారు ప్రచురించిన 'శాసన శబ్దకోశ్'కి, హిందీ సాహిత్య సమ్మేళన అధ్యక్షులుగా ఉపోద్ఘాతం వ్రాస్తూ రాహుల్ కొన్ని మార్గ దర్శక సూత్రాలని వివరించారు. ఆ శబ్దకోశంలో రెండవ కాలమ్ (వరసలో) డా. రఘువీర సృష్టించిన విపరీత రూపాలని, ఆ నాటికి ప్రచురించబడిన నిఘం టువులలోని రూపాంతరాలు అన్నింటినీ పొందుపరుస్తూ, మొదటి వరసలో ఇవ్వ బడిన సరళమైన, వ్యావహారిక పదజాలమే అభిలషణీయమైనది అని స్పష్టీకరించ బడింది. ఆ శబ్దకోశంలో ఆంగ్లంలోని 'Academy' అనే పదానికి 'అకాడెమి' అనే పదం పారిభాషికపదంగా ఇవ్వబడింది.

జానపదగీతాలన్నా, జానపదనాటకాలన్నా, జానపదగాథలన్నా రాహుల్‌కి అత్యంత అభిమానం. చిన్నవయసులోనే చనిపోయిన భోజపురి జానపదకవి బిశ్రామ్ గురించి ఆయన ఒక వ్యాసాన్ని వ్రాశారు. ఆయన గీతాలని సేకరించి ఒక సంపుటిగా రాహుల్ ప్రకటించటం కూడ జరిగింది. బుందేల్ ఖండ్ మాండ లిక భాషకి చెందిన ఇసూరి అనే జానపదకవి గీతాలనిగురించి కూడ ఆయన ఒక వ్యాసం వ్రాశారు. డా. రాజేంద్రప్రసాదుతో భోజపురిలోను, ఆచార్య – అమర నాథ్ ఝాతో మైథిలిలోను సంభాషించేవారు. నైనిటాల్‌లోని 'సిల్వర్ ఓక్' అనే తమ నివాసానికి సమీపంలోవుండే వృద్ధస్త్రీ దగ్గరనించి ఎన్నో జానపదగాథ లని, గీతాలని సేకరించి 'ఆది హిందీకి కహానియా ఔర్ గీతే' అన్న గ్రంథంలో ప్రచురించారు. ఆధునిక ఖరేబోలి హిందీకి మీరట్ ఆగ్రాలలో మాట్లాడబడే భాష మాతృక అని ఆయన విశ్వాసం. ఈ భాషని ఆయన 'కౌరవి' అని పిలిచే వారు. వారు సేకరించిన జానపదగాథలపైన, గీతాలపైన హర్యాన, బ్రజ భాషల ప్రభావాలతోపాటు, ఉర్దూభాష ప్రభావంకూడ కనిపిస్తుంది.

హిందీని జాతీయభాషగా చేయాలని రాహుల్ గట్టిగా వాదించారు. అయితే, ఆయన ప్రాంతీయ దురభిమాని కారు. హిందీతోపాటు, హిందీ భాషకి

చెంది మాండలికాలని వ్యవహరించబడే భోజపురి, అవధీ, బ్రజ, మైథిలి, రాజస్థాని వంటి మాతృభాషలని ప్రాథమిక విద్యకి బోధనా భాషగా అభివృద్ధి చేయాలి అని ఆయన అభిలషించారు. మాతృ భాషలైన ఈ మాండలికాలని అభివృద్ధి చేయాలనే ఆయన వాదనని భారతదేశంలో సోవియట్ పద్ధతిని అనుసరించి హిందీ భాషా ప్రాంతాలని ముక్క చెక్కలుగా చేయాలనే తలంపుగా విమర్శించ బడటం జరిగింది. ద్వితీయ ప్రపంచ సంగ్రామ కాలంలో ఆయన భోజపురిలో కొన్ని నాటకాలని రచించారు. ఇవి ముప్పై సంవత్సరాలకు పూర్వం జరిగింది. ఆ రోజులలో మైథిలి, రాజస్థాని, నేపాలి వంటి మాండలిక భాషలకి సాహిత్య గౌరవం ఇచ్చే విషయాన్ని ఎవ్వరూ చర్చించనైనా చర్చించే వారుకారు. ఇటీవల కాలంలోనే సాహిత్య అకాడమి ఈ భాషలకి ఆ గౌరవాన్ని కలిగించింది. భాషా విషయకమైన ఈ అల్పసంఖ్యాక వర్గాల హక్కులని పరిరక్షించాలి అని వాదించిన వారిలో రాహుల్ మొదటివారు. కాని దురదృష్టవశాత్తు, 1948 లో ఆయన బొంబాయిలో హిందీ సాహిత్య సమ్మేళనానికి అధ్యక్షులుగా ఉర్దూ భాషకి కూడ దేవనాగరి లిపి ఉపయోగించాలి అని చేసిన సూచన తీవ్ర వాదోప వాదాలకి దారితీసింది. ఉర్దూ మాట్లాడే కమ్యూనిస్టులు రాహుల్‌ని భారతీయ కమ్యూనిస్టు పార్టీ బహిష్కరించాలి అని పట్టుపట్టి కృతకృత్యులు కాగలిగారు.

'మాతృభాష'ల అభివృద్ధికి ఆయనచేసిన కృషిని కొందరు వ్యతిరేకించినా బనారసి దాస్ చతుర్వేది, డా॥ వాసుదేవ శరణ్ అగర్వాల్, పండిత క్షేత్రేశ చంద్రచటోపాధ్యాయ, డా॥ ఉదయనారాయణ్ తివారి వంటివారు ఆయనకి గట్టి మద్దతుదారులు అయ్యారు. యశపాల్ జైన్ నిర్వహించే 'మధుకర్' అనే పత్రిక ఈ లక్ష్యసాధనకే అంకితమైనది. సర్దార్ కె. ఎమ్. పాణికర్ తమ నిరసన ప్రకటించి నప్పటికి, రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ సంఘంచేసిన సిఫారసులు అప్పటికే ప్రచురించబడి వుండటం వలన హిందీ భాషాప్రాంతాల పునర్విభజన త్రోసి పుచ్చబడింది.

ఈ రంగంలో కూడ రాహుల్ మార్గదర్శకమైన కృషిని చేశారు. అలహాబాదులోని హిందీ సాహిత్య సమ్మేళనం వారి అధ్వర్యాన హిందీలోని ఉప భాషలకి ప్రత్యేకించబడిన 'సమగ్ర హిందీ సాహిత్య చరిత్ర' అనే గ్రంథానికి ఆయన సంపాదకత్వం వహించారు. భోజపురి, మైథిలి, మగాహి, అవధి, బ్రజ్, బుందేల్ ఖండి, రాజస్థాని, మాల్వి, నిమాది, హిమాచల ప్రదేశ్‌కి చెందిన పెక్కు

పహారి భాషవంటి మాండలికాలు అనబడే మాతృ భాషలని గురించి ఆ మాతృ భాషలలో ప్రత్యేక కృషిని చేసిన నిపుణుల ప్రత్యేక వ్యాసాలు ఈ గ్రంథంలో చేర్చబడ్డాయి. ఈ ఒక్క గ్రంథానికే రాహుల్ కి జాతీయ బహుమానం ఇవ్వటం న్యాయం. ఆయన జీవితంలోని అవసానకాలంలో ఆయనకి 'పద్మ భూషణ' లభించింది. ఆ సమయంలో ఆయన ఆ గౌరవాన్ని ఆనందిచగలిగే స్థితిలో లేరు; అప్పటికే ఆయన జ్ఞాపకశక్తి దెబ్బతినటం మొదలు పెట్టింది.

# 5. సాహిత్య సేవ

రాహుల్ వ్యక్తిత్వం, సాధించిన విజయాలు బహుముఖాలు, వివిధాలు కావటంవలన, ఆయన రాజకీయ విశ్వాసాలని విడచిపెట్టి ఆయన హిందీ సాహిత్యానికి చేసిన సేవకి మాత్రమే మన పరిశీలనని పరిమితం చేసుకోటం మంచిది. ఆయన రాజకీయ విశ్వాసాలు. భాషాసంబంధమైన ఆలోచనా విధానం, విప్లవాత్మకమైన సాంఘికదృక్పథం ఎన్నో వివాదాలకు దారితీస్తాయి. (హిందువు లంతా గోమాంసభక్షణచేయాలి అని బహిరంగంగా ప్రచారంచేయగా సనాతన హిందువులు కొందరు ఆయన్ని ఒక సభలో రాళ్ళతో కొట్టించటం జరిగింది.) ఈ ప్రకరణంలో, ఆయన రచనలలోని ఆలోచనా సరణిని, శైలిని ప్రదర్శించ టానికి ఆయన రచనలనించి ఉదాహరణల, ఉద్ధరణల **(Quotations)** ద్వారా ప్రయత్నం చేయబడుతుంది.

ఆయన ఆలోచనా సరణిలోను, జీవిత విధానంలోను రెండు విభిన్నశక్తుల మధ్య అన్ని రంగాలలోను ఒకవిధమైన సమన్వయం, సమదృష్టి మనకి కని పిస్తాయి. ఆయనలో సంప్రదాయ బ్రాహ్మణ మనస్తత్త్వం ఉన్నప్పటికి, ఆయన బౌద్ధమతాన్ని కూడ సమానంగా అభిమానించారు. సనాతన అభిమానం, అసం ఖ్యాక విగ్రహాల ఆరాధనపై అభిరుచితోపాటు ఆర్యసమాజంవారు ప్రచారంచేసిన విగ్రహారాధనపట్ల విముఖత్వం కూడ కనిపిస్తుంది. వీటన్నిటితోపాటు ఆయనలో వేదాలు పరమప్రామాణికాలు అన్న విశ్వాసంకూడ బలీయంగా కనిపిస్తుంది. ఈ విశ్వాసాన్ని ఆయన తరువాత కాలంలో తిరస్కరించారు. ఆయన సంస్కృతాన్ని పండితులవద్ద, అరబ్బిభాషని మౌల్విలవద్ద పాళీభాషని భారతదేశం, సింహళం

నేపాలు, టిబెట్‌దేశాలలోని బౌద్ధభిక్షువులవద్ద అభ్యసించారు. అయినా, తమ మేధని పూర్తిగా ఈ ప్రాచీనవ్యాకరణ కర్తల, సూత్రకారుల ఆలోచనల మూసలలో పరిమితం కానివ్వలేదు తమ స్వేచ్ఛామానసిక ప్రవృత్తిని కాపాడు కోగలిగారు. అంతేకాదు. నిరక్షరాస్యులైన సామాన్యప్రజలు, కార్మికులు, కర్ష కులు ఉపయోగించే 'ఛిన్నభాష'ని కూడ ఉపయోగించాలి అని ఆయన వాదించేవారు తమ అగ్రవర్ణాన్నించి తమకు తామే ఆయన వెలివేసుకున్నారు. చిన్నతనంలోనే, తమ కుటుంబపు బంధాలన్నీ తెంచుకున్న ఆ ప్రగాఢవ్యక్తిత్వం గల ఆ మనీషి తరువాతకాలంలో కార్మిక, కర్షక వర్గనియంతృత్వానికి చెందిన నవీనసిద్ధాంతాల ప్రచారకుడిగా, భాష్యకారుడిగా పరిణామం చెందారు. రష్యా లోని 'సాల్ ఖాజ్' (ఉమ్మడి భూములు)ని, చైనాలోని 'కమ్యూన్స్'ని దర్శించి ఆనందోత్సాహాలతో వాటిని కొనియాడారు. మఠాలని, ఆశ్రమాలని. సంకుచితా లైన రహస్యసంఘాలని, లామాల మతసంబంధమైన గుత్తాధిపత్యాన్ని ఆయన ఘాటుగా విమర్శించారు. సామాన్యమైన అర్థంలో ఆయన అస్తికులు కారు. కాని భారతీయ సంస్కృతిపై ప్రగాఢవిశ్వాసమూ అమితమైన అనురాగమూ ఆయనలో అంతర్వాహినిగా లేకపోలేదు. భారతదేశంలో భాషాసమైక్యతని సమ ర్థించటం వలన 1948 లో ఆనాటి భారత కమ్యూనిస్టుపార్టీవారి అధికారభాషా విధానానికి దూరమైపోయారు. ఇక్కడ మనం సజ్జాద్ జహీర్, డా. రామ్‌బిలాస్ శర్మ ఒకవైపు, రాహుల్ ఆయన మద్దతుదారులు ఇంకొకవైపు వెల్లడించిన అభి ప్రాయలలోని మంచి చెడులని చర్చించటంలేదు. రాహుల్ యొక్క అవిరామమైన హృదయంలో చెలరేగే సంఘర్షణ హిందీభాషలో ఆయన రచనలకి అనన్య సామాన్యమైన ఉన్నతని చేకూర్చింది అని మాత్రం సూచించబడుతోంది.

ఆయన తమ దైనందినచర్యని డెయిరీలో వ్రాసుకునేటప్పుడు, ఎన్నో విషయాలపై ఎంతో సునాయాసంగా అమితమైన ఆసక్తిని ప్రదర్శించేవారు. తమ 'ఆత్మకథ'ని రచించే సందర్భంలో ఆయన వాటిపైనే ఎక్కువగా ఆధారపడ్డారు. ఈ రచనలలో మనకు ఒక ద్వైపాక్షిక దృష్టి ద్యోతకం అవుతుంది. ఆనందాను భూతినిచెందే రాహుల్ ఆనంద దర్శనం పొందే రాహుల్ కంటె భిన్నమైనవ్యక్తి. తాను పాఠశాలలలో క్రమపద్ధతిలో విద్యని అభ్యసించక పోవటంవలన ఏర్పడిన వెలితిని బహుముఖమైన శతవిధమైన విజ్ఞానాన్ని, మానవుల మేధజ్ఞానసము

పార్జనలో ఎన్ని రంగాలలో కృషి చేయగలదో, ఆ జ్ఞానాన్ని ఒకవ్యక్తి ఎంతవరకు ఆర్జించగలడో అంతవరకు రాహుల్ ఆర్జించారు, తమ మేధాసంపత్తిని ప్రదర్శించు కుంటూ, పెంపొందించుకుంటూనే, హిమాలయపర్వతాలలోని సుందరదృశ్యాలని తిలకించటానికి ఒక్కక్షణం ఆగి రమ్యంగా వర్ణిస్తారు కూడ. ఒక్కొక్కసారి పల్లె ప్రాంతాలలో దయనీయమైన జీవితాన్ని గడుపుతున్న స్త్రీలపై తమ సానుభూతిని అప్రయత్నంగా వెలిబుచ్చుతారు. ఇంకొకసారి, వ్యంగ్యధోరణిలో గౌరవనీయు లైన పెద్దమనుషుల చిలిపిచేష్టలపై వ్యాఖ్యలు విసురుతూ ఉంటారు. ఆయన రచనలలోని శైలి ఒకేవిధంగా ఉండదు. అయినా, ఆయన రచనలలో ఎప్పుడూ ఏహో ఆశ్చర్యజనకాలైన, నమ్మశక్యం కాని సత్యదర్శనాలు, ఇంతకుముందు ఎవరికీ తట్టని ఆలోచనలు, ఎవరూ చేయని వర్ణనలు కనిపించటంవల్ల, పాఠకుడు రాహుల్ శైలిలో సోయగాలులేవని ఏవగించుకోడు. సామాన్య పాఠకుడి భావనా శక్తి ఎప్పటికప్పుడు ఉత్తేజితం అవుతుంది. ఈ మానసికస్థితిలో పాఠకుడు ఉండగా రాహుల్ వేలకువేల పేజీల సమాచారాన్ని అందజేస్తారు. ఇంకొక సందర్భంలో అయితే ఈ సమాచారం ఎంతో పేలవంగా ఉండేది. రాహుల్‌తో పాటు పాఠకుడుకూడ సాంస్కృతిక మానవతాశాస్త్రం, సామాజికశాస్త్రం, మతా ధ్యయనం, వాఙ్మయ, సాహిత్య పరిశోధనలకి సంబంధించిన అనేక విషయాల కొత్తపొరలు తియ్యటంలో నిమగ్నుడు అవుతాడు. వినూతన భూములలో, ప్రదే శాలలోని ఈ అనంత ప్రస్థానంలో, ఈ జ్ఞానాన్వేషణలో తానుకూడ ఒక భాగ స్వామి అనే ఆనందం పాఠకుణ్ని పరవశుణ్ణి చేస్తుంది. మానవకృషి సాధించే మహత్తర నిక్షేపావిష్కరణే జ్ఞానిని ధర్మించటమే ఈ జ్ఞానాన్వేషణకి ఫలశృతి. అతి సామాన్యములైన అనుభవాలలో అనంతానుభూతిని పొందగలిగిన రాహుల్ ఉత్సాహం పాఠకునిపై అత్యంతప్రభావాన్ని ప్రదర్శించటంవలన, ఆయన రచ నలలోని స్వాతిశయంకాని, విషాదంకాని పాఠకుణ్ని ఎక్కువగా బాధించవు.

ఆంగ్లకవి కీట్సు దేశద్రిమ్మరితనాన్ని గురించి వెలిబుచ్చిన ఈ భావాన్ని రాహుల్ తమ జీవిత తత్త్వంగా రూపొందించుకున్నారు

Ever let the fancy roam
Pleasure is never at home
(ఊహని విశాలంగా విహరించనీ!
ఇంటివద్దలేదు ఆనందం ఏనాటికీ!)

కాని తమ 'ఘూమక్కార్ శాస్త్ర' (పర్యటనాశాస్త్రం) లో ఆయన భావకవుల పలాయన వాదాన్ని సమర్థించలేదు. ఒక నిర్దిష్టమైన నిస్సంగవిధానాన్ని, జీవితం అనే పుస్తకంలోని ప్రతి అక్షరాన్ని అవగాహన చేసుకోగలిగిన పద్ధతిని ఆయన సూచించారు. సాధువుగా చిన్నతనంలో ఆయన పొందిన శిక్షణ, ఆర్యసమాజంతో ఆయనకి ఉన్న సంబంధబాంధవ్యాలు, ఆ తరువాత కిసాన్‌సభలో ఆయన పాల్గొనటం, పరస్పరవిరుద్ధాలైన టిబెట్, రష్యాలలో ఆయన పర్యటనలు ఆయనని ఆదర్శయాత్రికుడు ('ఘూమక్కర్')గా తీర్చిదిద్దాయి.

ఆయన ప్రత్యేకంగా అభిమానించే మహావ్యక్తులని గురించి ఆయన ప్రశంసాత్మక జీవితగాథలని రచించారు వారిలో నరేంద్ర యశ్‌కి 'ఘూమక్కర్-రాజ్' అని, భట్ దివాకర్‌కి 'ఘూమక్కర్' అని, కిస్తుప్‌కి 'మహాపర్యాటక్' అని, నయిన్ సింగ్‌కి 'పర్యాటక్' అని, బాబాకి 'ఫార్క్కర్' అని విశేషణాలని ప్రయోగించారు. యాత్రికులని, స్వాములని భిక్షువులని, బాధాంతులని. మహంతులని, పరివ్రాజకులని, బ్రహ్మచారులని, బాబా లని ఆయన అభిమానించిన మాట నిజం, 'అతీత్ సేవర్తమాన్,' 'జిన్‌కమైంక్రృతజ్ఞ" అనే రెండు సంపుటాలలో వీరి జీవిత గాథలు సంగ్రహంగా చిత్రించబడ్డాయి. రాహుల్‌కి స్నేహితులు సాధువులు, పండితులు మాత్రమేకాదు. ఆయనకి అన్ని మతాలకి చెందిన స్నేహితులు ఉండేవారు. హిందువులు, మహమ్మదీయులు బౌద్ధులు, జైనులు, క్రైస్తవులు, సిక్కులు, చివరకి నాస్తికులుకూడ ఆయన స్నేహాన్ని అపేక్షించేవారు. ఈ గ్రంథం నించి క్రింద ఇవ్వబడిన ఉద్ధరణలు ఆయన మనోవైశాల్యాన్ని వెల్లడిస్తాయి:

## ఆచార్య నరేంద్రదేవ

"జీవితాంతంవరకు నరేంద్రదేవ హేతువాదిగానే నిలబడ్డారు. వృద్ధాప్యం ఆయనని మార్చలేకపోయింది. వయసు మళ్లిన కొద్దీ చాలమంది మారిపోతూంటారు. మతానికి, వ్యక్తులకి అంకితమై పోయిన ప్రత్యేక ముఠాలు (cult) ని ఆయన ఎగతాళి చేసేవారు. హాస్యధోరణిలో ఆయన 'చోంచ్ పంథ్' (ముక్కుల ముఠా) ని ప్రారంభించారు. ఈ ముఠాలోని వారు ఎక్కడైనా కలుసుకుంటే, కుడి చేతి అరచెయ్యిని పక్షి ముక్కులా పొడుగ్గా చాపి అభినందించుకునేవారు. ఆయన మహాపండితులు, నిశితమైన ఆలోచనా పరులు, సంపూర్ణమైన విజ్ఞానం, సున్నిత

మైన హాస్యం కలిగిన ఆదర్శవాది. సోషలిజమ్‌లో అచంచలమైన విశ్వాసం కల వ్యక్తి ఆయన. ఆయనపై మార్క్స్ ప్రభావం ప్రగాఢంగా ఉండేది. నాకు కమ్యూనిజంపై అభిమానం ఎక్కువ. సోషలిస్టుపార్టీకి కమ్యూనిస్టుపార్టీకి మధ్య అంత సఖ్యత ఉండేదికాదు. అయినా, మా ఇద్దరి వ్యక్తిగత సంబంధాలు ఎప్పుడూ మార్పులేకుండా సుహృద్భావయుతంగానే ఉండేవి. ఉప్పు సత్యాగ్రహ సందర్భంలో నేను కాశీ విద్యాలయంలో వున్నప్పుడు మేము ఇద్దరం కలసి 'కమ్యూనిస్టు మేనిఫెస్టో'ని అనువదించటం జరిగింది.'

('జిన్ కా మైఁ కృతజ్ఞ' పుటలు: 183 - 184)

## కామ్రేడ్ మహమ్మద్ జఫర్

మహమ్మద్ కండలు తిరిగిన శరీరాన్ని చూడగానే, మొదటిసారి, స్ఫురద్రూపి అయిన పఠాన్ అని ఎవరైనా గ్రహించగలరు, కాని నున్నగా గడ్డం గీసుకున్న ఆయన ముఖంలో తాండవించే మధురమైన మందహాసాన్ని చూడగానే మనలో వేరొక భావం కలుగుతుంది. డియోలి కేంపు జైలులో నేను మొదటిసారి ఆయనని చూశాను. ఆయన చాల తక్కువ మాట్లాడారు. ఆయన కలం కూడ చాల పదునైనది. కాని ఆయన ఎంతో నిగ్రహంతో ఆ కలాన్ని వాడేవారు. డియోలిజైలులో ఉండగా నాకు గ్రంథాలయాలలో సామాన్యంగా లభించిన అరుదైన పుస్తకాలు కావలసి వచ్చాయి. మహమ్మద్ వాటిని అప్పటికే చదివి ఉన్నారు. ఆ పుస్తకాలు నాకు అందేలా ఏర్పాటుకూడ చేశారు. ఆయన ఎంతో దయార్ద్రహృదయుడు. ఉదారశీలుడు. సామాన్యంగా, కమ్యూనిస్టులు దయావిహీనులు అయిన కఠిన వ్యక్తులుగా చిత్రించబడుతారు. కాని మహమూద్ ఇందుకు పూర్తిగా భిన్నమైన వ్యక్తి. కరుణా ప్రపూర్ణుడైన ఆకర్షణీయుడైన వ్యక్తి. ఏ మాత్రం భేషజంలేని మనీషి. చాలాకాలం ఆయన పండిత నెహ్రూకి అంతరంగిక కార్యదర్శిగా పనిచేశారు. ఆయన తన ఆదర్శాలనే కాని ఏ పదవులని లెక్కచేసిన వ్యక్తికారు."

('జిన్ కా మైఁ కృతజ్ఞ' పుటలు: 237 _ 238)

## అకడమీషియన్ బారాన్నిఖోవ్

అలెక్సి పెట్రోవిచ్ బారాన్నిఖోవ్ భారతీయులకి అంతగా పరిచితుడైన వ్యక్తికాదు ఆయన మనకి ఇంకా ఎక్కువ తెలియటం అవసరం. లాలూలాల్జీ 'ప్రేమ సాగర్'ని, తులసీదాస్ 'రామచరితమానస్'ని ఆయన అనువదించారు.

తులసీరామాయణాన్ని అనువదించడంలో తమ పాండిత్యాన్ని మాత్రమే కాక అమితమైన భక్తిప్రపత్తులని కూడ ఆయన ప్రదర్శించారు మూలమైన అవధి భాషలో ఉన్న ఛందస్సుని, పద్యపాదాలని యథాతథకంగా రష్యన్‌భాషలో ఉపయోగించ టానికి ఆయన ప్రయత్నంచేశారు. ఈ గ్రంథం రష్యాలో ప్రచురించబడే సమ యంలో నేను లెనిన్‌గ్రాడ్‌లో ఉండటం తటస్థించింది ఈ గ్రంథంలో చేర్చవలసిన చిత్రాలతోపాటు ఆయన నాతో ఎన్నో విషయాలని చర్చించారు. ఆ రోజులలో భారతదేశానికి సోవియట్ రష్యాకిమధ్య దౌత్యసంబంధాలు వుండేవికావు. ఈ కావ్యానికి సంబంధించిన రెండు సచిత్రప్రతులనిగురించి చెప్పినప్పుడు ఆయన వాటిని సంపాదించటానికి ప్రయత్నంచేశారు. కాశీలోని నాగరిప్రచారిణీసభ వారికి ఈ విషయంలో సహాయంచేసింది. ఆయన బహుభాషావేత్త 'ట్సిగాన్' అనే జిప్సీలు రోమని - డోమనిభాష మాట్లాడుతారని. వారు భారతదేశాన్నించి వచ్చారు అని ఆయన నాతో చెప్పారు.''

(అతీత్‌సే వర్తమాన్, పుటలు: 98-102)

## నేపాలీకవి దేవకోట

"1953 వ సంవత్సరం జనవరినెలలో నేను అయిదవసారి నేపాలు వెళ్ళాను. నన్ను 'విదేశఅతిథి'గా పరిచయంచేశారు. నాకు నేపాలు విదేశం ఏమీ కాదు. నిజానికి, రచయితలకి ఏ దేశమూ విదేశంకాదు. మన సుమిత్రానందన్ పంత్‌ని సృష్టించిన హిమాలయపర్వతాలే నేపాలుదేశంలోని ప్రకృతి, ప్రేమలని కవితావస్తువులుగా స్వీకరించిన దేవకోట అనే కవినికూడ సృష్టించాయి ప్రసాద్, పంత్, 'నిరాలా'ల ముగ్గురిని ఏకంచేసిన రూపమే నేపాలీసాహిత్యంలో దేవకోట 'నిరాలా'లోవున్న ఇంకాకొన్ని లక్షణాలుకూడ ఈయనలో కనిపిస్తాయి; కాని మరీ అంతతీవ్రంగాకాదు. అసమానమైన ప్రతిభకి ఉన్మాదానికి మధ్యవున్న సరిహద్దు రేఖ చాలా సున్నితమైనది. తమ 44 వ ఏటకే ఆయన నేపాలు, ఇంగ్లీషుభాషలలో 38 పుస్తకాలు రచించారు. అందులో 26 పుస్తకాలని చించివేయటమో, పోగొట్టు కోవటమో జరిగింది. 1934 లో ఆయన మొదటికవిత 'గరీబు'ని రచించారు. అదే సంవత్సరంలో ఆయన 'మునా-మదన్' అనే సుదీర్ఘ జానపదగాథా కావ్యాన్ని రచించారు. ఆకర్షణీయమైన భావచిత్రాలతో ఆ కావ్యనాయకుడు టిబెట్‌కి చేసిన కష్టతరమైన ప్రయాణమార్గంలోని ప్రకృతిదృశ్యాలని ఆయన వర్ణించారు. కవితలు, కథానికలు, వ్యాసాలు ఎన్నో ఆయన వ్రాశారు. నిజానికి, ఆయన

ఒక వాఙ్మయబ్రహ్మ. ఎన్నో కొత్తపదాలని సృష్టించి ఆయన వాఙ్మయాన్ని సంపన్నవంతంగా చేశారు.'' (అతీత్‌సె వర్తమాన్': పుటలు105-118)

అసంఖ్యాకంగా రాహుల్ వ్రాసిన సాహిత్య వ్యాసాలు వారి గ్రంథాలలో, డైరీలలో అక్కడక్కడా మనకికనిపిస్తాయి. 1970 సెప్టెంబరులో 'రాహుల్ నిబంధావళి' (సాహిత్యం) అనే వ్యాస సంకలనం ప్రచురించబడింది. ఈ సంకలనంలో 'నేను కథా రచయితని ఎలా అయ్యాను?' 'ప్రేమచంద్ జ్ఞాపకార్థం', 'భారతేందు - పుష్కిన్', 'ఆకాశవాణి - జానపద గీతాలు', 'చారిత్రక నవలలు', 'మార్వారి, పహారి భాషల సంబంధ బాంధవ్యాలు', 'చౌరాసిసిద్ధ', 'స్వయంభు', 'ఆచార్య రఘువీర సాంకేతిక పరిభాష'' వంటి వ్యాసాలు చేర్చబడ్డాయి. తమ మొదటి వ్యాసంలో తమకు యాత్రికునిగా, బోధకునిగా ఉండాలనే అభిలాషని తెలియజేశారు. 'నా యాత్రల గాథలని వర్ణించే సందర్భంలోను ప్రతిపక్షం వారి వాదాలకి జవాబు చెప్పవలసిన సందర్భంలోను నేను వ్యాసాలు వ్రాయ వలసిన అవసరం ఏర్పడింది. నా మొదటి వ్యాసం బహుశా 1915 లో ప్రచురించబడింది. 37 సంవత్సరాలపాటు నేను ఆ వ్యాసాన్ని చూడటం జరగ లేదు. 1921 లో ప్రథమ సహాయ నిరాకరణోద్యమ సందర్భంలో నేను ఛాప్రా జైలులో వున్నాను. ఒక నూతన సమాజాన్ని గురించి కలలుగని, ఆ స్వప్నాన్ని సంస్కృత శ్లోకాలలో అయిదు ఆశ్వాసాల కావ్యంగా రూపొందించుకున్నాను. కాని ఆ కవిత్వం ఉపయోగకరం కాదని గ్రహించి హిందీ భాషలో 'బైసవీఁ సదీ' అనే గ్రంథాన్ని రచించాను. ఆంగ్లంనించి నాలుగు నవలలని అనువదించి, భారతీయ వాతావరణంలోకి పరివర్తనం చేశాను. 1935 లో సంఘంలో అట్టడుగున వున్న వారికి, నిర్భాగ్యులకి సంబంధించిన యథార్థ గాథలని చిత్రించటానికి ప్రయత్నం చేశాను. 'సతామి కె బచ్చే' ఈ కోవకి చెందిన రచన 1933 లో 'జీన్ కేలియే' అన్న నా మొదటి నవలను రచించాను. 1941-42 మధ్యకాలంలో భగవత్‌శరణ్ ఉపాధ్యాయ రచించిన చారిత్రక గాథలని కొన్నిటిని చూడటం తటస్థించింది, ఆయన తన కథలన్ని పూర్తిచేసివుంటే నేను 'వోల్గాసే గంగా' రచించవలసిన అవసరం ఉండేది కాదు. హజారిబాగ్ జైలులో 'వోల్గాసె గంగా'లోని ఇరవై కథలని వ్రాయటం పూర్తిచేశాను. వీటిలో ఏది అత్యుత్తమ కథో నేను నిర్ణయించి చెప్పలేను. ఈ కథలలో 'ప్రభ' అత్యుత్తమమైన కథ అని విమర్శకులు అభిప్రాయపడ్డారు. నాకు 'నాగదత్త', 'సురయ్యా' కూడ సమానంగానే నచ్చుతాయి.''

('రాహుల్ నిబంధావళి', పుటలు 3-5.)

రాహుల్ చేసిన కల్పనా సాహిత్య సృష్టిలో 'వోల్గాసే గంగా' అత్యుత్తమ రచన. ప్రగతిశీల రచనలలో యీ రచన ఒక మైలురాయిగా హిందీ విమర్శనలలో సంవత్సరాలుగా ప్రశంసించబడింది. మూఢ విశ్వాసాలు కలిగిన సనాతన వాదులైన విమర్శకులు కొందరు భారతదేశ చరిత్రకి సంబంధించిన కొన్ని సత్యాలని ఆయన తనకు తోచిన విధంగా మార్పులు చేశారని ఆక్షేపణలు తెలియజేశారు. చారిత్రక, గతితార్కిక భౌతికదృష్టితో భారతదేశచరిత్రకి పునర్వ్యాఖ్యానం చేసే మహత్తర కృషి యీ నవల అని మార్క్సిస్టులు కొనియాడారు. ఈ గ్రంథాన్ని సవివరంగా విపులంగా వర్ణించటం అవసరం అని భావిస్తున్నాను. వాస్తవానికి, యీ రచన నవల రూపంలో చేయబడిన చరిత్రక రచన. ప్రథమ ముద్రణకి 23-6-42 న పీఠిక వ్రాస్తూ ఆయన ఇలా అన్నారు.

"తన ప్రాథమిక దశనించి మానవుడు యీ నాటికి యీ దశకి చేరుకున్నాడు. ఎన్నో కష్టనిష్టురాలు ఎదుర్కొన్నాడు. 'మానవ సమాజ్‌లో మానవ సంఘం సాధించిన ప్రగతిని సిద్ధాంతదృష్టితో చర్చించటం జరిగింది. ఆ విషయాలని ఇంకా సులభమైన రీతిలో తెలియజేయ వచ్చుననే కోరిక ప్రస్తుత రచనని ప్రేరేపించింది. ఈ ప్రగతిని అవగాహన చేసుకోవటం సులభతరం చేయటం ఈ రచన పరమలక్ష్యం. భారతదేశంలోని పాఠకులు సులభంగా గ్రహించటానికి వీలుగా ఇండో-యూరోపియన్ జాతిని ఉదాహరణగా స్వీకరించాను. నేను స్వీకరించిన నాగరకతకంటె ఈజిప్టు, అస్సేరియా, సింధులోయ, నాగరకతలు అతిపురాతనమైనవి. ఆ నాగరకతలని స్వీకరిస్తే, రచయితకి పాఠకులకి కూడ ఎన్నో కష్టాలు యెదురయ్యేవి.

"ప్రతి ఒక్క కాలానికి చెందిన భారతదేశ సాంఘిక రూపాన్ని సత్యబద్ధంగా చిత్రించటానికి ప్రయత్నించాను. ఇటువంటి ప్రథమ ప్రయత్నంలో కొన్ని పొరపాట్లు దొర్లటానికి అవకాశం లేకపోలేదు. భావికాలంలోని రచయితలు ఇంతకంటె సరియైన. సత్య సమ్మతమైన భారత స్వరూపాన్ని చిత్రించగలిగితే అది నా అదృష్టంగా, నేనే సాధించిన విజయంగా భావిస్తాను.

"బాంధుల్‌మల్ (బుద్ధుడు) కాలాన్నిగురించి 'సింహసేనాపతి' అనే ప్రత్యేకమైన నవలని రచించాను."

అనాదికాలంలో చరిత్ర ప్రభాతసమయంనించి 1942 వ సంవత్సరం వరకు సంబంధించిన భారతదేశపు ఎనిమిదివేల సంవత్సరాల గాథ ఈ గ్రంథంలో

చిత్రించబడింది. ఇందులోని 'నషా', 'దివా', 'అమృతాశ్వ', పురూహూత్ అనే కథలలో క్రీ. పూ. 6000 సంవత్సరంనించి 2600 వ సంవత్సరంవరకు సంబంధించిన ఆదిచరిత్ర వర్ణించబడింది. బాధాంత ఆనందకౌసల్యాయన్ వీటిని ప్రశంసిస్తూ ఇలా వ్రాశారు. "ఈ కథలని సృష్టించటానికి కొంతకల్పన అవసరమైనా, అది కేవలం అభూతకల్పనకాదు. ఇండో-యూరోపియన్. ఇండో-ఇరేనియన్ శాఖలకి సంబంధించిన భాషల అధ్యయనం, చారిత్రక భాషాశాస్త్రంలో రాహుల్ చేసినకృషి, లోతైనపరిశోధన యీ కథలకి అసమానమైన గౌరవాన్ని సంతరించి పెట్టాయి."

ఆటవికస్థితిలో, సహజస్వరూపంతోవున్న ఆదిమ మానవుడితో ప్రారంభించి మానవుని ఆర్థిక. సాంఘికపరిణామాన్ని వ్యావసాయక, పశుసంవర్ధక పరిణామ ఘట్టాల ద్వారా, రాహుల్ చిత్రించారు భూస్వామ్యవ్యవస్థ, ఫ్యూడల్ వ్యవస్థ తరువాత వర్ణించబడ్డాయి. పితృసంబంధమైన సాంఘికవ్యవస్థ ఏర్పడిన తరువాత, బానిసవ్యవస్థకూడ ఆమోదయోగ్యం అయింది. సనాతన ఆచార్యవ్యవహారాలతో నిండిన మతం యీ సాంఘికవర్ణీకరణకి దోహదంచేసింది. చరిత్రని భౌతికదృష్టి నించి అవగాహన చేసుకోవటానికి ఉదాహరణలు రాహుల్ వేదాలనించి బ్రాహ్మణాలనించి మహాభారతంనించి, పురాణాలు బౌద్ధుల "అర్థకథ" నించి స్వీకరించారు ఇందులో ఆయన తమ మౌలికప్రతిభని వెల్లడించారు. 'సుదాస్' అనే కథని. ఋగ్వేదంనించి గ్రహించారు. 'బాంధుల్‌మల్' అనే కథని బౌద్ధగ్రంథాలనించి 'నాగదత్త'ని ఛాణక్యుని 'అర్థశాస్త్రం' నించి కాశీప్రసాద్ జైస్వాల్ రచించిన 'Hindu Polity' అనే గ్రంథంనించి, 'ప్రభ' అనే కథని, అశ్వఘోషుని 'బుద్ధచరిత', 'సౌందరనందం' అనే గ్రంథాలనించి ఆయన స్వీకరించారు. ఆయన రచనలోని చారిత్రక సత్యాలని Rhys David రచించిన Buddhist India కూడ ధ్రువపరచింది. 'సుపర్ణ-యౌధేయ' అనే కథకి కాళిదాసు పద్యాలు ఆధారం. 'దుర్ముఖ్' బాణవిరచిత 'హర్షచరిత' 'కాదంబరి గ్రంథాలపైనా. 'చక్రపాణి' 'నైషధం' పైనా ఆధారపడ్డాయి. ఇందులోని ఇరవై కథలలో పధ్నాలుగు కథలు సంస్కృత, పాళీగ్రంథాలపై ఆధారపడిన రచనలు.

ఇందులోని ఆఖరి ఆరుకథలు భారతదేశచరిత్రలోని మధ్యకాల, ఆధునిక కాలచరిత్రకి సంబంధించినవి. 'బాబానూరుద్దీన్' అనే కథకి అల్లావుద్దీన్ ఖిల్జీ పరిపాలనాకాలపుగాథ ఆధారం. 'సురయ్యా' అనే కథలో అక్బరుపాదుషా ఉదారమతవిధానాలు చిత్రితమయ్యాయి. 'రేఖాభగత్' అనే కథలో బ్రిటిషు ఫ

పాలనలోని ఘాతుకకృత్యాలు కళ్ళకుకట్టినట్లు వర్ణించబడ్డాయి. 'మంగల్ సింగ్' (1857), 'సఫ్దర్' (1922) సుమేర్ (1942) అనే కథలు వాటిరచయిత, ఆయన ముందుతరాలవారూ తిలకించిన, ఆలకించిన కఠోరమైనఆర్థిక, సాంఘిక, రాజకీయ వాస్తవాలపై ఆధారపడ్డాయి.

పక్షపాతవైఖరితో రచించబడిన చరిత్రలనీ, వక్రభాష్యాలుఅనీ, అసంగత మైన విషయాలు అనీ, కాలదోషంపట్టిన సంగతులనీ ఈ గ్రంథాన్ని పండితులు ఆక్షేపించటం జరిగింది కాని యీ ఆక్షేపణలు కూడ వారివారి చారిత్రక అవగాహనకి, పక్షపాతవైఖరికి సంబంధించిన విషయాలు కావచ్చు. ఇందుకు సంబంధించిన కొన్నివుదాహరణలని మనం పరిశీలించవచ్చు. 1. 'పురుధాన్', 'అంశీర', అనే కథలలో 'అసుర' జాతి వర్ణించబడింది. డా. భగవత్ శరణ్ ఉపాధ్యాయ అభిప్రాయం ప్రకారం ఆ జాతి సింధునది ప్రాంతాలకి చెందిన ద్రావిడ - అస్సీరియన్ జాతులవారి సంపర్కం. 2. వాల్మీకి రామాయణ రచనా కాలం శుంగ రాజులకాలం అని ఆయన అభిప్రాయపడ్డారు. దీనిపై డా. రామ్ బిలాస్‌శర్మ ఎగతాళిచేస్తూ ఇలా వ్యాఖ్యానం చేశారు. ''ఏమి కొత్త సామాజిక శాస్త్రం! రాముడు శుంగవంశ రాజులకు ప్రతీక, కాళిదాస విరచిత 'కుమార సంభవం' లోని కుమారుడు కుమారగుప్తునికి ప్రతీక. ఇంక మిగిలింది దశరథుడు, కౌసల్య, సీత, రావణుడు, వీళ్ళంతా ఎవరెవరి ప్రతీకలో తెలియజేయటం!'' తమ వామపక్ష పక్షపాతంతో డా. రామబిలాస్ శర్మ రాహుల్‌ని మాత్రమే కాక హజారి ప్రసాద్ ద్వివేదినికూడ బ్రాహ్మణాభిమానులు అని, సనాతనవాదులు అని ఆక్షే పించినవారే! 3. 'సుపర్ణ - యౌధేయ' లో హూణులని జయించిన రాజు 'సముద్ర గుప్తుడు' అని పిలవబడ్డాడు. నిజానికి, ఆ చక్రవర్తి స్కంద గుప్తుడు. 4.'దుర్ముఖ్' లో హర్షవర్ధనుని సోదరుడైన రాజవర్ధనుడు కన్యాకుబ్జాధిపతిగ పేర్కొన బడ్డాడు. కాని నిజానికి అతడు స్థానేశ్వర్ (అధునిక థానేశ్వర్) కి పాలకుడు. హర్షుడు క్షత్రియ శాతవాహన వంశానికి చెందినవాడుగా వర్ణించబడ్డాడు. కాని శాతవాహనులు బ్రాహ్మణులు. వారు హర్షుని పూర్వీకులు కారు. 5. ఈ కథలలో చిత్రించబడిన జయచంద్రుడు చరిత్రలో మనకు తెలిసిన వ్యక్తికి దగ్గరగాలేడు. మహమ్మదీయ చరిత్రకారులు అతనిని మహాయోధునిగా చిత్రించారు. 6. 'సురయ్యా' లో నాయిక అబుల్ ఫజల్ కుమార్తెగా మనకి కనిపిస్తుంది. ఆమె తోడర్‌మల్ కుమారుడైన కమల్‌ని వివాహం చేసికొనిన తరువాత ఇద్దరు యూరప్ యాత్రకి వెళతారు. చారిత్రకంగా ఈ విషయం నమ్మదగ్గదిగా కనిపించదు.

ఇటువంటి కొన్ని లోపాలు ఉన్నప్పటికీ, రచనా ప్రణాళికలోను, రచనా విధానంలోను ఈ గ్రంథం విశిష్టమైనది. ఎనిమిదివేల సంవత్సరాల చరిత్రని 386 మిక్కిలి ఆసక్తికరమైన పుటలలో సంక్షిప్తంగా ప్రదర్శించటంలో ఆయన పరిశీల నాత్మకమైన సృజనాత్మకమైన వ్యక్తిత్వానికి చెందిన ఏకాగ్రమైన దార్శనికశక్తి గోచరిస్తుంది. కథా రచయిత రచనా శిల్పమూ, ఆకర్షణా విహీనమైన చరిత్రకు సంబంధించిన అనాసక్తికరమైన విషయాలపై చరిత్రకారునికి ఉండే అభిరుచి మేళవించిన ఒక అరుదైన గ్రంథం ఈ రచన. ఈ గ్రంథం ఎన్నో వాగ్వివాదా లాని రేకెత్తించింది. 'విశ్వబంధు' లో కొందరు స్వామీజీలు తమ పేర్లు వెల్లడించ కుండా 'నగ్నవాది వేదనిందక్ రాహుల్' అనే వ్యాసాన్ని ప్రకటించారు. కాని భారత స్వాతంత్ర్యావతరణకి ముందే ఈ గ్రంథం బహుళ ప్రజాదరణ పొందింది. గోర్కీ రచించిన 'మదర్'తోపాటు 'ఓల్గా సే గంగా'కూడ భారతీయ భాషలన్నింటి లోకి అనువదింపబడి ఎన్నో ముద్రణల భాగ్యాన్ని పొందగలిగింది. ఇంగ్లీషు, రష్యను, జెక్ వంటి విదేశ భాషలలోకికూడ అనువదింపబడిన తరువాత ఈ గ్రంథా నికి అంతర్జాతీయ ఖ్యాతి లభించింది, రాహుల్ రచన లన్నింటిలోను ఈ గ్రంథం హిందీ సాహిత్యానికే కాక భారతీయ సాహిత్యానికే అమూల్యమైన ఆభరణంగా కొనియాడబడింది.

ప్రేమచంద్‌ని గురించి రాహుల్ ఇలా వ్రాశారు.

"నేను వారిని గురించి చాలా ముందే వినటం తటస్థించింది. వారి రచ నలని 1915 లోనే చదివాను. వారిని ప్రత్యక్షంగా చాలా తరువాత కానీ కలు సుకోలేకపోయాను. ఆయన రచనా శైలి అసమానమైనది. కాని ఆ శైలే ఆయన లోని లోపంగా ఆనాటి విమర్శకులు, హిందీ ఉర్దూ భాషలలోని పండితులు పరిగణించారు. ఆయన జీవితంలాగే ఆయన శైలి కూడా అతిసరళం, ఆయన తన భాషకి బాహ్యాలంకరణలని, కృత్రిమ వేషధారణని చేయాలని ప్రయత్నించ లేదు ఎక్కువమంది ప్రజల ఎక్కువ సౌఖ్యానికి (బహుజన హితాయః బహుజన సుఖాయ) ఆయన రచనలు చేశారు. ఆయన తన భాషని అనవసర మైన పాండిత్య ప్రకర్షతో నింపటానికి ఇష్టపడేవారు కారు. నేను మళ్లీ 1921 లో ఆయన రచనలు సాధించిన ప్రజాదరణని చూడకలిగాను. ఆయన రచనలు రేవేటియా అనే కుగ్రామంలోని నిరక్షరాస్యులైన పల్లె ప్రజలని కూడా ఆకట్టుకో గలిగాయి. 1920 - 30 సంవత్సరాల మధ్య కాలంలో సహాయ నిరాకరణో ద్యమ సందేశాన్ని ప్రచారం చేయటానికి ఆయన రచనలు తోడ్పడ్డాయి.

నేను వారిని 1926 లో కాశీలో కలుసుకున్నాను. ఒక ప్రసిద్ధ ఉర్దూ రచయిత ఆయన వచన రచన 'పూరబ్ కిబోలి' (తూర్పుదేశ మాండలికం) అని అభ్యంతరం తెలియజేశారు. ఈ పెద్ద మనిషి లక్నోలోని గౌరవనీయమైన నవాబు వంశానికి చెందినవారు. ఆయన కనక నవలలు వ్రాసి ఉంటే (అల్లా తప్పక ఆయన్ని ఆశీర్వదిస్తాడు!) నిరక్షరాస్యుడైన హోరి అనే కర్షకుడిచేత అరబ్బీ భాష మాట్లాడించేవాడు. హిందీ భాషా పండితులు, సంస్కృతీకరించబడిన హిందీలో ఉండే లోతు, నాజూకు తనం ప్రేమచంద్‌లో కనపడవు అని విమర్శించటం జరిగింది. ఉర్దూ హిందీ భాషలను సాహిత్యంలోని నవలా ప్రక్రియకి ఉపయోగించటంలో ఆయన ప్రథములు. సారనాథ్ సమీపంలోని ఆయన జన్మస్థానంలో నేను ఆయనని చివరిసారిగా కలుసుకున్నాను. ఇస్లామిక్ శిల్పాకళకి ముందు కాలానికి కాని, ఆ శిల్పకళ ప్రథమ దశకి కాని చెందిన ఒక విగ్రహం తాలూకు శిరోభాగం వారి ఇంట్లో కనిపించింది. ఆ శిరస్సు తాలూకు జుట్టునుబట్టి ఆ విగ్రహం కాయస్థులకి సంబంధించినది అని గ్రహించగలిగాను; ఆయన పూర్వీకులు ఎవరికైనా సంబంధించినది కావచ్చు. నేను ఆ శిల్పాన్ని ఒక ప్రధానమైన మ్యూజియమ్‌కి పంపించాను. చాపమీద అక్కడ కూర్చున్నప్పుడు అదే ఆయనతో ఆఖరి సమావేశం అని ఊహించనైనా ఊహించలేకపోయాను. నేను టిబెట్‌లో ఉన్నప్పుడు ఆయన మరణవార్త విన్నాను, తమ నవలలలో ఆయన సృష్టించిన ముఖ్యపాత్రలన్నీ ప్రేమచంద్ వ్యక్తిత్వానికి బాహ్యరూపాలుగా నా కళ్ళముందు కదలాడాయి. భారతదేశానికే ఆయన అమరుడైన రచయిత, కళాభిజ్ఞుడు. శతాబ్దాలు గతించినా ప్రేమచంద్ సృష్టించిన నవలా ప్రపంచం, నిర్ద్వంద్వంగా, నిజాయతితో భారతదేశ చరిత్రలోని సంధి యుగాన్ని చూపెడుతూనే ఉంటుంది. ('రాహుల్ నిబంధావళి', పుటలు 7 - 9)

రెండు సంపుటాల 'మధ్య ఆసియా చరిత్ర'తోపాటు, ప్రపంచ తత్త్వ శాస్త్రాలని భారతీయ తత్త్వ శాస్త్రంతో పోల్చిచేసిన తులనాత్మక పరిశీలన వారి మరో అమూల్యమైన రచన, ఒక సంపుటంలో బౌద్ధమత తత్త్వాన్ని (100 పేజీలు) ఇంకొక సంపుటంలో ఇస్లామిక్ మతసిద్ధాంతాలని (125 పేజీలు) సమగ్రంగా సవివరంగా తెలియచేసే గ్రంథం హిందీలో మరొకటి కనిపించదు.

1942 లో హజారిబాగ్‌లోని సెంట్రల్ జైలులో ఉన్నప్పుడు ఆయన ఈ గ్రంథానికి నాలుగు పేజీల ఉపోద్ఘాతాన్ని వ్రాశారు. ఈ ఉపోద్ఘాతంలోని మొదటి పేరాని ఆఖరి పేరాని ఉదాహరించకుండా ఉండటం కష్టం.

జీవితంపట్ల, ప్రపంచం మొత్తంమీద, ఇరవయ్యో శతాబ్దంలోని నాల్గవ దశకంలోని భారతదేశంపట్ల ప్రత్యేకగాం రాహుల్ తాత్త్వికదృష్టి సారాంశం ఈ పేరాలలో మనకి కనిపిస్తుంది:

"లక్షలాది సంవత్సరాలుగా మానవుడు ఈ భూమిపై నివసిస్తున్నా, ఆతని సమున్నతమైన విజ్ఞానవిహారానికి సంబంధించిన కాలం క్రి. పూ. 5000 నించి 3000 వరకు మాత్రమే. ఈ కాలంలో అతడు వ్యవసాయాన్ని, నీటి పారుదల విధానాన్ని, సౌరమానాన్ని, మానవసమాజ స్వరూపాన్ని సంపూర్ణంగా మార్చివేసిన ఇంకాకొన్ని ముఖ్యమైన పరిశోధనలని చేయగలిగాడు. విజ్ఞానం మళ్లీ త్వరగా అభివృద్ధిచెందటం మనకి 1760 తరువాత కనిపిస్తుంది. ఈ కాలంలో ఎన్నో ఆధునిక పరికరాల తయారీ నిర్విరామంగా కొనసాగింది. ప్రథమదశలో వేదాంతతత్త్వం అసలు లేనే లేదు. రెండవ దశలో ఈ తత్త్వం తనకాలం తీరి పోయినా రంగంనించి నిష్క్రమించని వృద్ధుడిలా కనిపిస్తుంది. వృద్ధుడిపై గౌరవంతో ప్రజలు ఆయన మాటలని వింటారు. కాని వాటిని విశ్వసించాలంటే ప్రజలదృష్టిని ఆ మాటలు ఆకర్షించాలంటే ప్రయోగాల ద్వారా నిరూపించబడే శాస్త్రీయసత్యాలు అవసరం. కాని ఈ విషయాన్ని సనాతన మతప్రచారకులైన సర్ రాధాకృష్ణన్‌వంటి వారు అంగీకరించరు. 'ప్రాచీన భారతదేశంలో ఏ కళకి కాని, శాస్త్రానికి కాని తత్త్వజ్ఞానం దాస్యం చేసేదికాదు. మతానికి ఎప్పుడూ ఒక స్వాతంత్ర్య ప్రతిపత్తి ఉండేది' అని అంటూ ఉంటారు. కాని నిజానికి భారత దేశంలో తత్వశాస్త్రం ఎప్పుడూ మతానికి లోబడే ఉండేది. పైగా, మతదాస్యం కంటె హీనమైన దాస్యం మరొకటి ఉండదు....

"ప్రపంచ వ్యాప్తంగా ఉన్న తాత్త్విక ధోరణులని పరిశీలించిన తరువాత, అవి నిజానికి అంతర్జాతీయమైనవి కాని జాతీయమైనవి మాత్రమే కావని స్పష్టం అవుతుంది. ఒక మతం ఇంకొక మత సిద్ధాంతాలని ఆమోదించిన దానికంటె, ఒకశాఖ ఆలోచనా సరణిని ఇంకొక శాఖ ఆదరించటంలో తత్త్వశాస్త్రాలు ప్రశంస నీయమైన మనోవైశాల్యాన్ని వెల్లడించాయి. తాత్త్విక చింతన వెనుక ఆర్థిక ప్రభా వాలు ఏమీలేవని వాదించటం సరైనదికాదు. కాని మతంతో పోల్చిచూస్తే, తత్త్వ శాస్త్రం ఒకదేశపు గుత్తాధిపత్యాన్ని ఇంకొక దేశంపై రుద్దాలి అని ప్రయత్నించలేదు. వైజ్ఞానిక రంగాన్ని మినహాయిస్తే, తత్త్వశాస్త్రంలో తప్ప వేరెక్కడా మనకి గంగా ఆము, డాజియా (టైగ్రిస్, యూఫ్రెటీస్) నదుల సంగమం, నలందా, బొఖారా, బాగ్దాద్, కార్డోవాల సమన్వయం కనపడవు. సమయాభావం వలన, సమాచారాన్ని

సేకరించటానికి అవకాశాలు తక్కువ కావటం వలన, చైనా జపాను దేశాల తత్త్వ వేత్తలని ఇందులో చేర్చటానికి వీలుపడనందుకు విచారిస్తున్నాము. అయితే, ఒక విషయం నిస్సందేహంగా చెప్పవచ్చు. సంకుచితమైన జాతీయతని ప్రచారంచేసే మహానుభావులు ఆత్మవంచన, పరవంచన కూడ చేస్తున్నారు.

(దర్శన్ - దిగ్దర్శన్ - పుటలు - 5 - 8)

భారతదేశానికి, బౌద్ధమతానికి చెందిన తత్త్వశాస్త్రాలని పునరవగాహన చేసు కోవటంలోనే కాక, భారత,రష్యాదేశాలమధ్య విద్యా, సాంస్కృతిక సంబంధాలకి శంఖు స్థాపన చేయటంవంటి అభ్యుదయ భావనలకి రాహుల్ మార్గదర్శకులయ్యారు. మినయేవ్, బారాన్నిఖోవ్, షెర్‌బాట్స్కి వంటి సోవియట్ రష్యాలోని 'భారత అధ్యయనపరులు' (Indologists) చేసిన కృషిని భారతదేశంలో రాహుల్ చేశారు. భారతదేశానికి చెందిన సోవియట్‌దేశపరిశీలకునిగా,సోషలిస్టు సిద్ధాంతాల వ్యాఖ్యాతగా రాహుల్‌కి ఎప్పుడూ ప్రథముడిగా, సమున్నతస్థానాన్ని అలంక రించిన వ్యక్తిగా గౌరవప్రతిపత్తులు ఉన్నాయి.

భాషపైనా, సాహిత్యంపైనా, అందులో ముఖ్యంగా హిందీ, దేవనాగరి లిపులపైనా ఆయన అభిప్రాయాలు ఇంతకుమందే వివరించబడ్డాయి. ఆయన ఆంగ్ల భాషకీ, మరి ఏ ఇతర విదేశభాషకి స్వతహాగా వ్యతిరేకులు ఏమీకారు. కాని వారి ఉద్దేశంలో ఈ భాషలు తెచ్చిపెట్టిన భేషజాలు, మాతృభాషలపై చేసే స్వారీ అసహజమైనవి. హిందీ సాహిత్యపు పరిమితులుకూడ ఆయనకి పూర్తిగా తెలుసు. 1948 వరకు హిందీలో నాటకరచన వాసిలోను. రాశిలోను చాలా తక్కువ అని ఆయన భావించారు. వైజ్ఞానిక సాహిత్య రచనలో కూడా హిందీ చాలా వెనక బడి ఉన్నదని ఆయనకి తెలుసు. హిందీ వ్యాకరణాన్ని సులభం చేయాలని ఆయన అభిలషించారు. ఈ సందర్భంలో 'ఉదీచి' 'ప్రతీచి' ప్రయోగాలనెన్నిటినో తమ సంస్కృత వ్యాకరణంలో చేర్చుకొనిన పాణినిని ఉదాహరిస్తూ ఉండేవారు. ఒకే వరసలోఉండే అక్షర క్రమానికి (mono- line typography) తగినవిధంగా దేవనాగరిలిపిని కూడ సంస్కరించాలి అని ఆయన భావించారు. హిందీభాష, దేవనాగరిలిపి ఎంతో త్వరగా అభివృద్ధి చెందాలని ఆయన ఆకాంక్షించారు.

సాహిత్య విమర్శలో, ప్రజాబాహుళ్య శ్రేయస్సుకి ఉపకరించే సామాజిక చైతన్యస్ఫూర్తి కలిగిన అభ్యుదయ సాహిత్యాన్ని ఆయన అభిమానించేవారు. గజదంత గోపురాలకి పరిమితమై, ఎవరో కొందరి అభిరుచులకోసమే సృష్టించబడే కళని, సాహిత్యాన్ని ఆయన వ్యతిరేకించారు. కవిత్వంలోను, నవలారచనలోను

స్థానికత, ప్రాంతీయత ప్రతిఫలించటం ఆవశ్యకమని చెబుతూ ఒక సందర్భంలో ఆయన ఇలా వ్రాశారు : 'హిందీ సాహిత్యంలో వైవిధ్యలోపం మనకి స్పష్టంగా కనిపిస్తుంది. దీనికి ఒక ముఖ్యకారణం లేకపోలేదు. బీహారులోని వరిపొలాలు మాగాణిభూములనించి, దేవదారు వృక్షాలతో నిండిన ఘరేవాల్‌లోని హిమాలయ పర్వత శ్రేణులు, లోయలనించి, జబల్‌పూర్‌లోని వింధ్యపర్వత ప్రాంతాలకి చెందిన అరణ్యప్రాంతాలనించి వచ్చిన హిందీ రచయితలు అందరు తమ కవిత్వంలోకి వచనరచనలలోకి తమ ప్రాంతీయస్పృహని, నిసర్గప్రకృతి రమణీయ దృశ్యాలని ప్రవేశపెట్టకూడదు అనే ఒక రహస్యఒప్పందానికి వచ్చినట్లు, నిశ్శబ్దమైనకుట్ర చేస్తున్నట్లు కనిపిస్తుంది.'

(సాహిత్య నిబంధావళి, పుట : 9)

ఆయన యీ విషయాన్ని స్పష్టంగా ఇలా చెప్పారు. "ప్రగతిశీలుడైన రచయిత ఏ ప్రత్యేక విశ్వాసానికి వర్గానికి చెందడు. ప్రగతిశీలతకి మూసిన మార్గాలని తెరవటం, విశాలంచేయటం ముఖ్య లక్ష్యాలు. ప్రగతిశీలుడైన కళాకారుడు స్వాతంత్ర్యానికి శత్రువుకాడు. అతడు బానిసత్వానికి, సంకెళ్ళకిమాత్రమే శత్రువు."

ఆయన దృష్టిలో అభ్యుదయ రచయిత ప్రజల రచయిత. అతడు ప్రజల భాషని ఉపయోగిస్తాడు. ప్రజలకోసం వ్రాస్తాడు. "సామాన్య ప్రజానీకానికి రచయిత గట్టిస్నేహితుడు. వారి ఆందోళనకి చేయూతనిచ్చే కామ్రేడు. అతడు వారికి నాయకుడు; వారికి సైనిక నాయకుడు మాత్రమేకాక, సిపాయి కూడా. అందువల్ల, అతడు తాను ఎప్పుడూ సామాన్య ప్రజానీకంలో ఒకడిగానే భావించుకోవాలి."

ఇటువంటి ఆలోచనలు ఉన్న రాహుల్ 'కళ కళకోసం' అనే వాదానికి స్వభావసిద్ధంగా వ్యతిరేకులు. ప్రజల కళలని, ప్రజల సంగీతాన్ని ప్రజల నృత్యాలని ఆయన అభిమానించేవారు. జానపద కళలు మ్యూజియములకి, నాగరిక ప్రజల వినోదాలకి మాత్రమే పరిమితం కావటం ఆయనకి ఇష్టంలేదు ఆయన దృష్టిలో కళకి ఒక ప్రయోజనం ఉండాలి. పేదప్రజానీకాన్ని, సంఘంలో అధోగతిలో ఉన్న అభాగ్యులని ఉద్ధరించి, సమసమాజాన్ని సృష్టించి అందరికి సమాన అవకాశాలని కలిగించి, దారిద్ర్యంనించి అందరికి విముక్తి కలిగించటమే కళలకి పరమప్రయోజనం అని ఆయన విశ్వసించారు.

చిట్టచివర, 'బుద్ధుడు-గాంధీ' అనే వ్యాసంలోని కొన్ని భాగాలని పరిశీలిద్దాం. ఈ వ్యాసం మొదట ఆంగ్లంలో రచించబడినది అని, కాని దురదృష్టవశాత్తు ఆ ఆంగ్లమూలం లభ్యం కాలేదు అని ఒక సూచికలో తెలియజేయబడింది. వాస్తవాలతో సంబంధంలేని స్వాప్నికుడని, గుత్తాధిపత్యం వహించే వ్యాపారస్థుల దళారి అని అహింసాసిద్ధాంతాలని విశ్వసించే ఊహా ప్రపంచజీవి అని గాంధీని ఆయన ఇంతకుముందు ఘాటుగా విమర్శించటం జరిగింది. కాని 1947 తరువాత 1948 జనవరి 30 కి ముందు ఆయన వ్రాసిన అభినందన వ్యాసంలో ఆయన తమ తీవ్ర ఆక్షేపణని పూర్తిగా విడచిపెట్టారు. ఈ వ్యాసంలో భారతదేశానికి చెందిన ఇద్దరు మహావ్యక్తులని ఆయన అతిసూక్ష్మ దృష్టితో పరిశీలించి, వారిలోని సాదృశ్యాలని ఈ విధంగా వివరించారు:

" 'సబ్బేసత్తా భవంతు సుఖితత్తా' (ప్రాణికోటి సమస్తం సుఖంగా ఉండాలి) అని బుద్ధుడు బోధించాడు. కాని ఆయన కార్యవిముఖుడైన స్వాప్నికజీవికారు, ఆయన యథార్థవాది. ఆయన తన శిష్యులని కార్యరంగంలో ప్రవేశించమని ఉద్బోధించారు. ప్రజలలో అధిక సంఖ్యాకుల అధికమైన ఆనందం కోసం పర్యటనలు చేయమని వారిని ఆదేశించారు. ఎక్కువమంది ప్రజల ఎక్కువ సుఖ సంతోషాలు కొందరు స్వార్థపరుల ఆనందాలతో ఘర్షణపడటం పదే పదే జరుగుతుంది అని ఆయనకు తెలుసు, ఎన్నో విభిన్న వర్గాలుగా సంఘం చీలిపోయింది అత్యాశ, వ్యక్తిగతమైన ఆస్తుల సంపాదన సమాజంలోని దారిద్ర్యానికి మూలకారణం అని ఆయన భావించారు. దొంగతనం, దోపిడీ విధానం, సొంత సంపదలని అమితంగా పెంచుకోవటం వంటివి అత్యాశనించే ఉత్పన్నం అవుతాయి. న్యాయవిరుద్ధమైన ఇటువంటి వ్యవస్థనించి విముక్తుడు కావటానికే మానవుడు ఆదరాభిమానాలు నిండిన సంఘాన్ని నెలకొల్పుకున్నాడు కాని అస్తవ్యస్తమైన ఈ పరిస్థితికి బుద్ధుడు అంతిమ పరిష్కారాన్ని కనుక్కోలేకపోయాడు బౌద్ధ భిక్షువులకి, భిక్షిణులకి సమసమాజ వ్యవస్థని బోధించాడు. తన అంతిమ సందేశంగా 'నహి వేరేన్ వేరాని సమ్మతీః కుదాచన్' (శత్రుత్వము, హింస ఏనాటికి శత్రుత్వాన్ని, హింసని జయించలేవు) అని ప్రపంచించాడు.

"ప్రపంచ మహాసంగ్రామం తరువాత, ప్రపంచంలో గాంధీని మినహాయిస్తే, ఇటువంటి అమూల్యమైన సందేశాన్ని అందించగలిగిన మహావ్యక్తి కనిపించరు. గాంధీలో బుద్ధుని మౌలికత అగుపించదు. ఆయన అనుసరించిన

అహింస, సత్య సిద్ధాంతాలని వాటి చారిత్రక సందర్భం నించి వేరు పరచి పరిశీలిస్తే, అవి వ్యక్తికి సంబంధించిన ప్రత్యేకమైన విధానము (idiosyncrasy) అని అనిపిస్తుంది. కాని గాంధీ విశ్వజనీనమైన ప్రేమ, శాంతి ప్రచారం చేశారు. ఈ విషయంలో బుద్ధుని కంటే గాంధీయే ఎక్కువ కష్టాలని ఎదుర్కొనవలసి వచ్చినది. అని కూడ నేను చెప్పగలను. అంగుళిమాల అనే బందిపోటు దొంగ తనని చంపుతానని బెదిరిస్తే బుద్ధుడు నిర్భయంగా అతడిని ఎదుర్కొన్నారు. కాని గాంధి బుద్ధి పూర్వకంగా మంటలలోకి దూకి, తమ ప్రాణాన్ని లెక్కచేయకుండా, ఎందరో ఇతరుల ప్రాణాలని రక్షించటానికి ఎన్నోసార్లు ప్రయత్నించారు. బోయెర్ యుద్ధం సందర్భంలో దక్షిణ ఆఫ్రికాలో ఆయన అదే చేశారు. మత సామరస్యాన్ని సాధించటానికి కలకత్తా, ఢిల్లీవంటి అనేక ప్రదేశాలలో ఇదే సాహసాన్ని ఆయన చేశారు. ఇవి ఎవరికి తెలియవు? ఆయన నిజంగా మహాత్ముడే. ఇందులో ఏ సందేహమూ లేదు.

"భగవంతుడి పైన, చలనం లేని దృష్టితో సాంఘిక వ్యవస్థని పరిశీలించే తత్త్వం పైన ఆయనకి విశ్వాసం ఉంది. అయినా, ఆయన తనకు తోచిన రీతిలో కార్యాచరణశీలిగానే ఉండేవారు. బుద్ధునిలా ఆయన కూడ అధిక సంఖ్యాకుల అధికమైన సుఖం కోసమే తమ జీవితాన్ని అంకితంచేశారు. ('బహుజనహితాయ') బౌద్ధమత సిద్ధాంతాలని తమ విశ్వాసాలుగా ఆయన అవలంబించకపోవటం విచారకరం. కాని చాలా కాలంగా ఒక నూతనమైన వ్యక్తిత్వం గాంధీలో ఆవిర్భవిస్తోంది. ఆయన రాజకీయ స్వాతంత్ర్యంతో మాత్రమే తృప్తిపడలేదు. ఆ స్వాతంత్ర్య ఫలితంగా ఆర్థిక స్వాతంత్ర్యం కూడ కావాలని ఆయన ఆశించారు. అప్పుడే, నిజమైన సాంఘిక విప్లవం ఉద్భవిస్తుంది. కొన్ని అగ్రవర్ణాలవారి, వర్ణాలవారి చేతులలో అధికారమంతా ఉండటం నిజమైన ప్రమాదం అని, శాపం అని ఆయన కూడ గ్రహించారు. అందుకే నిరంకుశంగా, న్యాయ విరుద్ధంగా దేశంలోని సంస్థానాధిపతులు చేసే పరిపాలనని ఆయన ఘాటుగా నిర్మొహమాటంగా విమర్శించేవారు, సోషలిజమ్ గురించికూడ ఆయన మాట్లాడకపోలేదు. కాని సత్యాహింసలపై ఆయన ఎక్కువ మక్కువ చూపించేవారు. నిజమైన సోషలిస్టు ఎవరూ సత్యానికి విరోధికాలేదు. దౌర్జన్య విధానాన్ని ఆ విధానం కోసమే సమర్థించనూ లేదు. వాస్తవానికి, మిగిలిన శాంతియుత పోరాటంలోని మార్గాలన్నీ విఫలమైనప్పుడు, పరిమితం చేయబడినప్పుడు, దౌర్జన్యకాండ కొనసాగుతున్నప్పుడు మాత్రమే కమ్యూ

నిస్టులు కాని సోషలిస్టులు కానీ, ఆత్మరక్షణకోసం దౌర్జన్య విధానాన్ని బల పరుస్తారు.

"భావికాలంలో, గుత్తదారీ కేపిటలిస్టులని అదుపు ఆజ్ఞలు లేకుండా ఆ వర్గాలవారికి న్యాయవిరుద్ధమైన అండదండలు ఇస్తున్న అగ్రవర్గాలవారినీ ఎదిరిస్తూ ఇంకా తీవ్రమైన సంఘర్షణ జరుగుతుంది. అగ్రవర్గాలుచేసే ఘాతుక కృత్యాల కంటె అహింసాశక్తి మహోత్తమమైనదని నా నమ్మకం. ఒక్క రక్తపుబిందువు నైనా చిందించకుండా, కాలం చెల్లిపోయిన భూస్వామ్యవ్యవస్థని ఆయన సమూ లంగా నాశనం చేయగలరు. మనకి ఉన్నసమయం చాలతక్కువ. ఆయన ఎన్నో ఏళ్ళు జీవించాలని ఆశిద్దాం. కాని ఆయన జీవిత కాలానికి కూడ పరిమితులు తప్పవు, ఆయన మనకి రాజకీయ స్వాతంత్ర్యాన్ని ప్రసాదించారు. ఆర్థికసమా నతని కూడ ఆయన మనకి ప్రసాదిస్తారని ఆశిద్దాం. ఈ మహాత్కార్యంలో ఆయన విజయవంతులు అయితే ప్రపంచ చరిత్ర, అఖిలమానవజాతి ఆయనని మరచిపోలేవు. ఆ సమయంలో ఆయన బుద్ధునిమించిన మహావ్యక్తిగా భాసించ గలరు." (అతీత్‌సె వర్తమాన్: పుటలు : 120-23)

—:o:—

# అనుబంధం-1

## రాహుల్ జీవితంలోని ముఖ్య ఘట్టాలు



ఏప్రిల్ 9, 1893 : ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలో ఆజంఘర్ జిల్లాలోని తమ తాతగారి ఊరు పందాహాలో జననం. తండ్రి గోవర్ధన్‌పాండె. తల్లి కుల్వంతీదేవి నలుగురు సోదరులు, ఒక సోదరి అందరిలోను ఈయన అగ్రజులు. నిజనామం. కేదారనాథ్‌పాండే.

**1912-13 :** పరాశఆశ్రమంలో సాధువు; వారసుడిగా నియామకం.

**1913-14 :** దక్షిణదేశ పర్యటన.

**1922 :** బక్సార్ జైలులో ఆరునెలలు. జిల్లాకాంగ్రెసు కార్యదర్శి పదవి.

**1923-25 :** హజారిబాగ్ జైలులో

**1927-28 :** శ్రీలంకలో సంస్కృత ఉపాధ్యాయుడిగ. బౌద్ధసాహిత్య అధ్యయనం.

**1929-30 :** టిబెట్‌లో పదిహేనునెలలు.

**1931-32 :** ఇంగ్లాండు, యూరప్‌లలో.

**1934 :** టిబెట్‌లో రెండవయాత్ర.

**1935 :** జపాను, కొరియా, మంచూరియా, సోవియట్ రష్యాలలో పర్యటన.

**1936 :** టిబెట్‌లో మూడవయాత్ర.

**1937 ;** సోవియట్ రష్యాలో రెండవ పర్యటన.

**1938 :** టిబెట్‌లో నాల్గవయాత్ర ఐగర్ జననం.

**1939 :** అమవారిలో కిసాన్ సత్యాగ్రహం, ఆ తర్వాత జైలులో.

**1940-42 :** హజారిబాగ్ జైలులో; డివోలికేంపులో.

**1943 :** ముప్పైనాలుగుఏళ్ల తరువాత జన్మస్థలానికి తిరిగిరాక, మొదటి భార్య ఆయనని సందర్శించటం ఉత్తరఖండ్ యాత్ర.

**1944-47 :** సోవియట్ రష్యాలోని లెనిన్‌గ్రాడ్ విశ్వవిద్యాలయంలో ఆచార్య పదవి.

**1947-48 :** అలహాబాదులోని హిందీసాహిత్య సమ్మేళన అధ్యక్షులు.

**1950 :** మసూరిలో ఒక ఇల్లు కొన్నారు. తరువాత, అమ్మివేశారు.

**1953 :** కుమార్తె జయ జననం.
**1955 :** కుమారుడు జేట జననం.
1958 : చైనాలో నాలుగున్నర మాసాలు.
1959-61 : శ్రీలంకలో తత్త్వశాస్త్రాచార్యపదవి.
డిసెంబరు **1961 :** జ్ఞాపకశక్తిని కోల్పోవటం
1962–63 : సోవియట్ రష్యాలో ఏడుమాసాల చికిత్స.
ఏప్రిల్ 14, 1963 : నిర్యాణం.

## రాహుల్ సాంకృత్యాయన్‌కి లభించిన పురస్కారాలు

1. మహాపండిత : కాశీపండితసభ.
2. త్రిపిటకాచార్య : విద్యాలంకార పరివేన, శ్రీలంక
3. సాహిత్య వాచస్పతి : హిందీ సాహిత్యసమ్మేళన్, అలహాబాదు
4. డి. లిట్ (ఆనరరి) భగల్‌పూర్ విశ్వవిద్యాలయం, భగల్‌పూర్
5. డి. లిట్ (ఆనరరి) విద్యాలంకార విశ్వవిద్యాలయం, శ్రీలంక
6. పద్మభూషణ్ : భారతప్రభుత్వం

## అనుబంధం – 2

# రాహుల్ సాంకృత్యాయన్ రచనలు

## సాహిత్యం

### హిందీ

**నవలలు :**

1. బైసవీఁ సదీ 1923 ?
2. జీన్ కేలియే 1940
3. సింహ సేనాపతి 1944
4. జై యౌధేయ 1944
5. భాగో నహీఁ, దునియా కో బదలో 1944
6. మధుర్ స్వప్న 1949
7. రాజస్థానీ రాణివాస్ 1953
8. విస్మృత్ యాత్రి 1954
9. దివోదాస్ 1960

కథానికలు :

10. సాత్‌మి కె బచ్చే 1935
11. వోల్గా సే గంగా 1944
12. బహురంగి మధుపురి 1953
13. కనైలా కి కథ 1955 – 56

ఆత్మకథ :

14. మేరీ జీవన్ యాత్రా (5 సంపుటాలు) I - 1944
II - 1950

(8 సంపుటాలు మరణానంతరం ప్రచురించబడ్డాయి)

జీవిత గాథలు :

15. సర్దార్ పృథ్వీ సింగ్ 1955
16. నయే భారత్‌కే నయే నేతా 1942 (రెండు సంపుటాలు)
17. బచ్‌పన్ కి స్మృతియాఁ 1953
18. అతీత్ సె వర్తమాన్ (మొదటి సంపుటం) 1953
19. స్టాలిన్ 1954
20. లెనిన్ 1954
21. కార్ల్ మార్క్స్ 1954
22. మావ్‌సే టుంగ్ 1954
23. ఘూమక్కర్‌స్వామి 1956
24. మేరే అసహయోగ్ కె సాథీ 1956
25. జిన్‌కా మైఁ కృతజ్ఞ 1956
26. వీర్ చంద్రసింగ్ ఘర్‌వాలి 1956
27. సింహళ ఘూమక్కర్ జయవర్ధన్ 1960
28. కప్తాన్‌లాల్ 1961
29. సింహళకే వీర్ పురుష్ 1961
30. మహామానవ్ బుద్ధ 1956

యాత్రా గ్రంథాలు :

31. మేరీ లడాఖ్ యాత్రా 1926
32. లంక 1926 - 27
33. మేరీ యూరప్ యాత్రా 1932
34. మేరీ తిబ్బత్ యాత్రా 1937
35. యాత్రా కె పన్నె 1934 - 36
36. జపాన్ 1935

37. ఇరాన్ 1935 - 36
38. రూస్ మేఁ పచ్చీస్ మాస్ 1944 - 47
39. కిన్నర్ దేశ్ 1948
40. తిబ్బత్ మేఁ సవావర్ష్ 1931
41. ఘూమక్కర్‌శాస్త్ర 1949
42 ఆసియా కె దుర్గమ భూఖండోం మేఁ 1956
43. చీన్ మేఁ క్యాదేఖా ? 1960

వ్యాసాలు :

44. సాహిత్య నిబంధావళి 1949
45. పురాతత్త్వ నిబంధావళి 1936
46. దిమాగి గులామీ 1937
47. తుమ్‌హారి క్షయా 1937
48. ఆజ్ కి సమస్యాయేఁ 1944
49. సామ్యవాద్ హీక్యోం ? 1 34
50. అతీత్ సె వర్తమాన్ (రెండవ సంపుటం) 1953

భోజ్‌పురి

51. తీన్ నాటక్ 1942
52. పాంచ్ నాటక్ 1942

టిబెటన్

53. తిబ్బతీ బాలశిక్ష 1933
54. పథావళి (సంపుటములు) 1, 2, 3) 1933
55. తిబ్బతీ వ్యాకరణ్ 1933

## సాహిత్యేతరములు (హిందీ)

విజ్ఞాన శాస్త్రం :

1. విశ్వ కి రూప్‌రేఖా 1942

సామాజిక శాస్త్రం :

2. మానవ్ సమాజ్ 1942

రాజకీయ శాస్త్రం :

3. సోవియట్ న్యాయ 1939
4. రాహుల్జీ కా అప్‌రాధ్ 1939
5. ఆజ్ కి రాజనీతి 1949
6. కమ్యూనిస్ట్ క్యా చాహ్తే హైఁ ? 1953
7. క్యా కరేఁ ? 1937

8. చీన్‌మేం కమ్యూన్ 1960
9. సోవియట్ కమ్యూనిస్ట్‌పార్టీకా ఇతిహాస్ 1939
10. రామరాజ్య అవుర్ మార్క్సవాద్

తత్వశాస్త్రం :

11. వైజ్ఞానిక భౌతికవాద్ 1942
12. దర్శన్–దిగ్దర్శన్ 1942
13. బౌద్ధదర్శన్ 1942

మతం :

14. బుద్ధ-చర్య 1930
15. ధమ్మపద 1933
16. మఝిమ నికాయ 1933
17. వినయ పిటక 1934
18. దీర్ఘనికాయ 1935
19. తిబ్బత్ మేం బౌద్ధధర్మ 1935
20. బౌద్ధ సంస్కృతి
21. ఇస్లామ్ ధర్మకి రూప్‌రేఖా 1923

యాత్రాగ్రంథాలు :

22. సోవియట్ భూమి
23. సోవియట్ మధ్య ఆసియా
24. డార్జిలింగ్ పరిచయ్ 1950
25. కుమాయూన్ 1951
26. ఘరేవాల్ 1952
27. జౌన్సార్-డెహరాడూన్
28. ఆజమ్‌ఘుర్‌కి పురాకథా
29. హిమాచల్ ప్రదేశ్ 1954 (అముద్రితం)
30. నేపాల్ 1953

నిఘంటువులు :

31. శాసన్–శబ్ద-కోశ్ 1943
32. టిబటి-హిందీకోశ్ (మొదటి సంపుటం) 1974

సాహిత్య చరిత్రలు :

33. హిందీ కావ్యధారా (అపభ్రంశ) 1944
34. దక్షిణీ కావ్యధారా 1952

జానపద సాహిత్యం :

35 ఆది హిందీకి కహానియాఁ అవుర్ గీతేఁ 1950

పరిశోధన :

36. సారాహ్పద్ కృత్ దోహా కోశ్ 1954

చరిత్ర :

37. మధ్యఆసియా కా ఇతిహాస్ (మొదటి సంపుటం) 1952
38. ఋగ్వేదిక్ ఆర్యా 1956
39. అక్బర్ 1956
40. భారత్ మేఁ అంగ్రేజి రాజ్యకె సంస్థాపక్ 1957
41 పాళిసాహిత్య కా ఇతిహాస్

సంకలనాలు :

42. తులసీ రామాయణ్ సంక్షేప్ (సంకలనం) 1957
43. సూత్ర కృతాంగ (సంపాదకత్వం) సంస్కృతం
44. సంస్కృత కావ్యధారా 1955 సంస్కృతం
45. పాళీ కావ్యధారా (అముద్రితం) పాళి

అనువాదాలు :

46. శైతాన్ కి ఆంఖ్ 1923
47. విస్మృతి కే గర్భమేఁ 1923
48. జాదూకా ముల్క్ 1923
49. సోనేకి ఢాల్ 1923
50. దాహ్ఖుండ 1947
51. జోదాస్ థే 1947
52. అనాథ్ 1948
53. సంవిధాన్ కా మసౌదా 1948
54 అదీన 1951
55. సుద్ఖోర్కి మౌత్ 1951
56. షాదీ 1952

## సంస్కృత గ్రంథాల సంపాదకత్వం, అనువాదాలు, పరిశోధన

57. సంస్కృతపాఠమాల (అయిదు భాగాలు) 1928
58. అభిధర్మకోశ్ 1930
59. విజ్ఞప్తి మాత్రతాసిద్ధి 1934
60. హేతు-బిందు 1944
61. సంబంధ-పరీక్ష 1944
62. నిదాన-సూత్ర (పరీక్షా) 1951
63. మహాపరినిర్వాణసూత్ర 1951
64. వాద-న్యాయ
65. ప్రమాణ-వార్తిక 1935
66 ప్రమాణవార్తిక భాష్య 1935-36
67. ప్రమాణవార్తిక వృత్తి 1936
68. ప్రమాణవార్తిక స్వవృత్తి 1936
69. ప్రమాణవార్తిక స్వవృత్తి టీకా 1937
70. అధ్యార్ధశతక 1935
71. విగ్రహ-వ్యావర్తిని
72. వినయసూత్ర 1943

## ఇతర భాషలలో లభ్యమయే రాహుల్ రచనల అనువాదాలు

1. సింహసేనాపతి : ఉర్దూ, మరాఠీ, గుజరాతీ, తెలుగు.
2. జయయౌధేయ : మరాఠీ, గుజరాతీ.
3. వోల్గాసే గంగా : ఉర్దూ, సింధీ, గుజరాతీ, మరాఠీ, కన్నడ, మలయాళం, తమిళం, తెలుగు, ఒరియా, బెంగాలీ, అస్సామీ, నేపాలీ, బర్మీస్, ఇంగ్లీష్, రష్యన్.
4. మధుర్ స్వప్న, గుజరాతీ
5. సర్దార్ పృథ్వీసింగ్ - మరాఠీ, గుజరాతీ
6. వైజ్ఞానిక్ భౌతిక్‌వాద్ : బెంగాలీ
7, దర్శన్ దిగ్దర్శన్ : బెంగాలీ, మలయాళం
8. టిబెట్ మేఁ సవావర్ష్ : బెంగాలీ
9. బైసవేఁ సదీ : ఉర్దూ, గుజరాతీ, మరాఠీ

10. సామ్యవాద్ హి క్యోం ? ఉర్దూ, తమిళం

11. మానవ్ సమాజ్ : బెంగాలీ, గుజరాతీ

12. విశ్వ కి రూప్‌రేఖా : మలయాళం

13. సంస్కృత పాఠమాల : సింహళం